శ్రీమదాంధ్ర

# మహాభారతము

## ఉద్యోగ పర్వము

వెల ఒకరూపాయి

---

<u>త్వరలో వచ్చుచున్నది</u>

# టామ్ సాయర్

(పిల్లల నవల)



రచన

మార్క్ ట్వేన్

అనువాదం

నండూరి రామమోహనరావు

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికనుండి పునర్ముద్రితము

---

కాపీలకు

**ఆంధ్ర గ్రంథమాల,**

**నెం 7 తంబుచెట్టివీధి, మద్రాసు 1**

9 వ తేదీన విడుదల!

అంజలీదేవి నాగేశ్వరరావు
సూర్యప్రభ సి.యస్.ఆర్
శివరావు రేలంగి గిరిజ
సి వరలక్ష్మి రామ్మూర్తి
సీతారాం సదాశివరావు
అన్నపూర్ణ విజయలక్ష్మి
నటించిన



వినోదా వారి

# స్త్రీ సాహసము

దర్శకత్వం
వేదాంతం రాఘవయ్య
రచన పర్యవేక్షణ
సముద్రాల



...సంగీతం
సుబ్బురామన్
కళ
వాలి . గొడగాంకర్
ఛాయాగ్రహణం
బి యస్ రంగా



MATA

CHE PRASAD

ఆంధ్ర సీడెడ్ నైజాం : పూర్ణా రిలీజ్  మైసూరు : అమృత్ రిలీజ్

# విషయానుక్రమణిక

## 8 ఆగస్టు 1951



# రచయితలకు మనవి

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికలో ప్రచురించే నిమిత్తమై వందలాది రచయితలు ప్రతినెలా వెయ్యికిపైగా వ్యాసాలు పంపుతున్నారు దీనివల్ల ప్రచురించని వ్యాసాలు దాచిఉంచటంలోనూ, ప్రచురణకుగాను స్వీకరించిన వ్యాసాలు వెంటనే ప్రచురించటంలోనూ ఇబ్బంది కలుగుతున్నది అందరి సౌకర్యార్థమూ ఈ క్రింది నియమాలను రచయితలు పాటించవలెనని ప్రార్థించుచున్నాము

(1) తాము పంపే వ్యాసాలు ప్రచురించని పక్షంలో తిప్పిపంపటానికీ, ప్రచురించే పక్షంలో తెలియజేయటానికీ వీలుగా స్టాంపులు జతచేర్చి పంపేది లేదా రచనల కాపీలు తమవద్ద ఉంచుకొనేది పోస్టుబిళ్లలు జతపరచని రచనలు తిప్పిపంపబడవు

(2) దయచేసి వ్యాసాలు (Essays) గాని అనువాదాలుగాని పంపవద్దు

(3) "బొమ్మరిల్లు" శీర్షికకు పంపే రచనలపై "బొమ్మరిల్లు" అని వ్రాసేది

—సంపాదకుడు.

# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా రు 12-0-0
విడిప్రతిక 4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
Founder K NAGESWARA RAO

సంపుటము 43
సంచిక 47
8-8-51

ఖర సంవత్సర శ్రావణ శుద్ధ పంచమి బుధవారము


# పర్షియన్ పెట్రోల్ తగాదా

పర్షియాలో పెట్రోలు తగాదా శాంతియుతంగా పరిష్కారమయ్యే సూచనలు ఇటీవల కొద్దిగా ఎక్కువైనట్టు కనిపిస్తోంది తొందరపడి ఏపనీ చెయ్యకూడదని బ్రిటిష్ ప్రభుత్వం, పర్షియా ప్రధానీకూడా వెనుక ముందు దాడుతున్నారు ఈమాదిరి పరిస్థితికి ముఖ్యకారణం అమెరికన్ అధ్యక్షుని పనుపున ఎవరెల్ హారిమన్ టెహరాన్, లండన్‌లలో జరిపిన సౌహార్ద సమాలోచనలే అంతవరకూ తీవ్ర దృక్పథాలు ప్రదర్శించిన ఉభయపక్షాలు తిరిగి పరిష్కార చర్చలకు సుముఖమైనాయి ఆంగ్లో ఇరానియన్ కంపెనీకి ప్రతినిధిగా బ్రిటిష్ ప్రభుత్వమే వ్యవహరించడానికి, దక్షిణ పర్షియాలో బ్రిటిష్ పౌరులపై విధింపబడిన నిబంధనలను సడలించి చర్చలకు అనువైన వాతావరణం కల్పించడానికి పర్షియన్ ప్రభుత్వం అంగీకరించింది బ్రిటిష్ ప్రభుత్వంకూడా పర్షియన్ పెట్రోలు గనులను జాతీయం చేయడాన్ని సూత్రప్రాయంగా తాను అంగీకరిస్తున్నట్లు తిరిగి స్పష్టంచేసింది హారిమన్ కృషిఫలితంగా పర్షియన్ ప్రభుత్వంతో చర్చల నిమిత్తం ప్రతినిధివర్గాన్ని పంపడానికి కూడా అంగీకరించింది రిచర్డుస్టోక్స్ నాయకత్వాన టెహరాన్‌కు ఒక ప్రతినిధివర్గాన్ని పంపింది

పెట్రోలు జాతీయకరణాన్ని సూత్రప్రాయంగా అంగీకరించడమంటే ఏమిటో, ఈ చర్చలు ప్రారంభమైతేనేగాని స్పష్టపడదు అబడాన్‌లోని రిఫైనరీ కర్మాగారాన్ని మూసివేసినప్పటికి అక్కడనుండి తాము కదలబోవడంలేదనీ, దానివల్ల ఎట్టి ఫలితాలు సంభవించినప్పటికి తాము వెనుదీసేది లేదని బ్రిటిష్‌ప్రభుత్వం తిరిగి తిరిగి ఉద్ఘాటిస్తోంది బ్రిటన్‌లో అధికారంలో ఉన్నది సోషలిస్టుప్రభుత్వం కనుక జాతీయకరణాన్ని "సూత్రప్రాయంగా" అంగీకరించింది కాని ఆచరణలోకి వచ్చేసరికి ఈ దృక్పథం చాలా పరిణామం చెందవచ్చును పర్షియాను బలప్రయోగంచేతనైనా సరే లొంగదీయాలని కన్సర్వేటివ్ అతివాదులు ఆర్భాటం చేస్తున్నారు ఈ సమస్యపై ప్రతిపక్ష అభిప్రాయాన్ని కేవలం నిర్లక్ష్యం చేయగల సాహసం బ్రిటిష్ ప్రభుత్వానికి లేదు కనుకనే ఒకవంక చర్చలకు అంగీకరిస్తూనే పర్షియాకు సమీపంలో యుద్ధనౌకలను, పారాచూట్ సైనికదళాలను బ్రిటన్ ఆయత్తంచేస్తున్నది కాగా, టెహరాన్‌లో జరుగనున్న చర్చలలో బ్రిటిష్ ప్రతినిధివర్గం పూర్తి జాతీయకరణాని కంగీకరించకపోవచ్చును తమకుకూడా పెట్రోలు ఉత్పత్తిలో కొంత వాటా ఉండాలని పట్టుపట్టవచ్చును పర్షియా ప్రధాని మొసాదిక్ ఇటీవల ఒక విషయం స్పష్టంచేశాడు తాను రాజీనామానైనా ఇస్తానుగాని, పర్షియాకు లాభించని పరిష్కారానికి ఒప్పుకోనన్నారు పర్షియాకు దీర్ఘకాలిక ఋణసహాయం చేస్తామని హారిమన్ ద్వారా అమెరికా తెలియజేసి ఉంది ఈ లాభసాటి బేరాన్ని వదులుకుని బ్రిటన్‌తో ఎటువంటి రాజీకి అంగీకరించకపోవడమా, లేక రాజీపడి అటు పర్షియన్ తీవ్రవాదుల క్రోధానికి గురికావడమా అనేదే ఇప్పుడు మొసాదిక్ ఎదుర్కొవలసిన సమస్య ఒకటి యుద్ధప్రమాదానికి, మరొకటి స్వదేశీయుల క్రోధానికి దారితీస్తాయి ఈ సమస్యమీద మొసాదిక్ స్వీయక్షేమంకూడా ఆధారపడివుంది

## శ్వేతపత్రం:

భారతప్రభుత్వం మొన్న 4వ తేదీన ప్రకటించిన శ్వేతపత్రం పాకిస్థాన్‌లో ఎటువంటి ప్రచారం జరుగుతున్నదీ సోదాహరణంగా వివరిస్తున్నది భారతదేశ విభజనను ఏ బెదిరింపులద్వారా సాధించారో కాశ్మీర్‌ను కూడా అదే పద్ధతిలో సాధించాలని పాకిస్థాన్ నాయకులు ప్రయత్నిస్తున్నారు ఈ బెదిరింపులకు, హైదరాబాదులో ఒకానొకప్పుడు బీభత్స నాటకమాడిన రజాకార్ నాయకుల బెదిరింపులకంటే ఎక్కువ విలువ ఇవ్వనవసరంలేదు సమయం వచ్చినప్పుడు ఈ బెదిరింపులు పెనుగాలికి మబ్బులు విడిపోయినట్టు చెద

(47-వ పేజీ చూడండి)




## ఆదివారం, జూలై 29 :

—పెట్రోలు తగాదాపై కొత్తగా బ్రిటన్ చేసిన ప్రతిపాదనలకు పర్షియా సమాధాన మిచ్చింది ఈ సమాధాన ఫలితంగా చర్చలు జరగవచ్చుని పర్షియన్ మంత్రివర్గ సంబంధీకులు భావిస్తున్నారు

—బియ్యం కోటాల కేటాయింపులో కేంద్రప్రభుత్వం మద్రాసు రాష్ట్రానికే అగ్రప్రాధాన్యత ఇస్తున్నట్లు ఆహారమంత్రి కె ఎమ్ మున్షీ అన్నారు

—అ భా బ్యాంకి ఉద్యోగుల సంఘం తమ కేంద్రవర్గంవారి సలహాను త్రోసిపుచ్చి అక్టోబరు 1 నుండి సమ్మె జరపడానికి నిశ్చయించింది

—సరిహద్దుల రక్షణకు ఇండియా తగు జాగ్రత్తలు తీసుకున్న తర్వాత ఇండియా పాకిస్థాన్ల మధ్య యుద్ధం రేగే అవకాశం తగ్గినట్లే భావించవచ్చుని ప్రధాని నెహ్రూ అన్నారు

—సమితి మధ్యవర్తి డా॥ ఫ్రాంక్ గ్రాహం శ్రీనగర్ వెళ్లారు

## సోమవారం, జూలై 30 :

—పర్షియా ప్రభుత్వంతో కొన్ని వివాదగ్రస్తాంశాలపై సమాధానం కుదరగానే పెట్రోలు తగాదాపై ప్రత్యక్ష చర్చలు జరిపేందుకు లార్డు ప్రైవీసీల్ రిచర్డు స్టోక్సు నాయకత్వాన బ్రిటిష్ ప్రతినిధివర్గ మొకటి టెహరాన్ వెడుతుంది

—అవినీతి ప్రవర్తనగల అధికారులకంటే నీతివంతులైన అధికారులే ఈనాడు ఎక్కువగా ఉన్నారు ఇటీవలి సంవత్సరాల్లో అధికారిక అవినీతి ఎక్కువైనదనేది శుద్ధాబద్ధమని హోం మంత్రి రాజగోపాలాచారిగారు చెప్పారు

—కాశ్మీర్ తగాదాలో నిగ్రహం అవలంబించండని ఇండియా పాకిస్తాన్లకు అమెరికా సలహా ఇచ్చింది

—లియాకతాలీ ఆహ్వానాన్ని తిరస్కరిస్తూ, ఆయనసే ఢిల్లీకి రావలసిందని పండిట్ నెహ్రూ ఎటువంటి షరతులు లేని ఆహ్వానం పంపారు.

—వచ్చే జనవరి ప్రారంభంనుండి దేశవ్యాప్త ఎన్నికలు జరపడానికి భారత ప్రభుత్వం నిశ్చయించినట్లు కాంగ్రెసు ప్రధానకార్యదర్శి మోహన్లాల్ గౌతమ్ వెల్లడించారు

—రాబోయే ఎన్నికల్లో ఏ పార్టీ ఏ చిహ్నం ఉపయోగించవలెనో నిర్ణయించడానికి ప్రధాన ఎన్నికల కమీషనరు సుకుమారసేన్ అధ్యక్షతక్రింద ఢిల్లీలో వివిధ పార్టీ ప్రతినిధుల సమావేశం జరిగింది.

## మంగళవారం, జూలై 31 :

—ఇండియాకు పాకిస్తాన్ పై దురాక్రమణ వాంఛ లేనేలేదని బ్రిటన్లోని భారత హైకమీషనర్ వి కె కృష్ణమీనన్ లండన్ పత్రికా విలేఖరులకు తెలియజేశారు

—అవినీతి నిర్మూలనకు భారత ప్రభుత్వం త్వరలో రహస్య సమాచార సేకరణ, దర్యాప్తు బ్యూరో నొకదాన్ని ఏర్పాటు చేస్తుందని హోంశాఖ కార్యదర్శి హెచ్. వి ఆర్ అయ్యంగార్ వెల్లడించారు

—జపానీస్ సంధి ముసాయిదాపై తన అభ్యంతరాలను తెలియజేస్తూ ఇండియా అమెరికన్ ప్రభుత్వానికి ఒక లేఖ అందజేసినది.

—సాగుకు వీలైనభూమి, నీటి పారుదల, పశుసంపదలను అభివృద్ధి చేసేందుకు దశవర్ష ప్రణాళిక నొకదాన్ని వ్యవసాయ పరిశోధనబోర్డు, వ్యవసాయ విస్తరణ బోర్డుల సంయుక్త సమావేశం ఆమోదించింది

—ప్రపంచంలో పెద్దదైన అబడాన్ పెట్రోలు రిఫైనరీ కర్మాగారం మూసివేయబడింది దక్షిణ పర్షియా నూనెగని ప్రాంతంలో సైనికశాసనం మరొక రెండు నెలలకు పొడిగించబడింది.

—కొరియా యుద్ధం ఇంకా సాగితే అమెరికన్ సైన్యపు 1952 బడ్జెట్టును 700 కోట్ల డాలర్లు అధికంగా పెంచవలసి ఉంటుందని సైనికశాఖామంత్రి ఫ్రాంక్ పేస్ చెప్పారు

—రాష్ట్రంలో ఎలిమెంటరీ విద్య నభివృద్ధి చేసేందుకు జిల్లాబోర్డులకు ధనసహాయంచేయ నిశ్చయించామని రాష్ట్ర విద్యామంత్రి మాధవమీనన్ తెలిపారు

—దక్షిణ వియట్నాం గవర్నరు తాయ్ లాప్ తాన్, ఫ్రెంచి సేనాధిపతి చార్లెస్ చాన్సన్ ఇరువురూ ఒకవియట్నాంజాతీయ వలంటీరుచేత హత్యగావించబడ్డారు

—కొరియాలో తటస్థప్రాంతం ఏర్పాటు చేసేవిషయమై వచ్చిన ప్రతిష్ఠంభన ఇంకా అలాగే ఉంది 38 వ అక్షాంశరేఖకు అటు ఆరు మైళ్లు, ఇటు ఆరు మైళ్ళు ఉభయులు వెనక్కు తగ్గాలని కమ్యూనిస్టుల వాదన.

## బుధవారం, ఆగస్టు 1 :

—మూడు వారాలనుంచీ ఒరిస్సాలోని 14 కాలేజీల విద్యార్థులు చేస్తున్న సమ్మె విరమింపబడింది

—బ్రిటిష్ విదేశాంగమంత్రి హెర్బర్ట్ మోరిజన్ ఇచ్చిన ఒక సందేశమును సోవియెట్ కమ్యూనిస్టుపార్టీ పత్రిక ప్రావ్దా పూర్తిగా ప్రకటించింది దానికి తవ

## వివాహము



వరుడు

చి పి. యస్. పరమేశ్వరన్

మద్రాసులో సుప్రసిద్ధ అడ్వర్టయిజింగ్ ఏజన్సీ అగు పి యస్ మణి అండ్ కో ప్రొప్రయిటరగు శ్రీ పి యస్ మణిగా పుత్రుడు

వధువు

చి. సౌ. మీనాక్షి

మధుర ప్రిన్సిపాల్ సబ్ జడ్జి అగు శ్రీ సి ఆర్ విశ్వనాధఅయ్యర్ గా కుమార్తె, జులై 15 వ తేదీన మధురలో వి వివాహము వేదవిహితముగ జరిగినది

సమాధానం కూడా ప్రకటించింది ఈ ప్రకటనలు ప్రజాస్వామ్యంపై ఉభయుల అభిప్రాయాలను తెలుపుతున్నాయి

—అబడాన్‌లో ఉండటానికే తాము నిశ్చయించామనీ, అందువల్ల ఎలాంటి ఫలితాలు సంభవించినా వెనుదియ్యమని లార్డు చాన్సెలర్ లార్డు జోవిట్ చెప్పారు

—జెకోస్లావాకియాతో అమెరికా వ్యాపార సంబంధాలు రద్దు చేసుకున్నది

—ఇజ్రాయిల్‌కు సూయజ్ కాలువ గుండా పోయే సరకులను ఈజిప్టు అటకాయించకుండా చేయవలసిందని బ్రిటన్ భద్రతామండలిని కోరింది

—కొరియాలో తటస్థప్రాంతం ఏర్పాటుపై కమ్యూనిస్టులు చేసిన ప్రతిపాదనను అమెరికా విదేశాంగమంత్రి ఎచిసన్ తిరస్కరించారు

—హిమాచలప్రదేశ్‌లోను, పంజాబు, యు పి ల పర్వతప్రాంతాల్లోను ఎన్నికలు వచ్చే అక్టోబరులో జరుగుతాయని, మిగతా దేశమంతటా 1952 జనవరి మొదటివారంలో ప్రారంభమవుతాయనీ ప్రధాన ఎన్నికల కమీషనర్ సుకుమారసేన్ ప్రకటించారు

## గురువారం, ఆగష్టు 2 :

—పండిట్ నెహ్రూ ఆహ్వానాన్ని తిరస్కరిస్తూ, లియాకత్ ఆలీఖాన్ మళ్లీ ఆహ్వానలేఖ పంపారు తన శాంతిప్రతిపాదనలను తిరిగి ఆలోచించమని కూడా కోరారు

—వివిధ పార్టీలకు ఎన్నికల కమీషనరు ఈ క్రింది చిహ్నాలు కేటాయించారు ప్రజాపార్టీ - కుటీర చిహ్నం, హిందూమహాసభ - గుర్రం, రౌతు, మార్కిస్టుఫార్వర్డు బ్లాకు - సింహం; రూయికర్ ఫార్వర్డు బ్లాకు - మానవ హస్తం, రామరాజ పరిషత్ - ఉదయభానుడు, షెడ్యూల్డు కులాల ఫెడరేషన్ - ఏనుగు

—మద్రాసురాష్ట్రంలో ఎన్నికలు జనవరి 4 నుండి మూడు వారాల్లో జరుగుతాయి

—రఫీ అహ్మద్ కిద్వాయ్ కేంద్రప్రభుత్వానికి రాజీనామా ఇచ్చారు, అధ్యక్షుడు ఆమోదించారు

—నేపాల్‌లో తూర్పు కోసన గల ఝాపా, ఇలాం జిల్లాలను తిరుగుబాటుదార్లు ఆక్రమించుకున్నారని తెలిసింది

—వచ్చే అక్టోబరునుండీ బట్టల ధరలు ఇంకా తగ్గించబడతాయని భారత వ్యాపార పారిశ్రామికశాఖల మంత్రి హరేకృష్ణ మహతాబ్ అన్నారు

—కొరియాలో తటస్థప్రాంతం ఏర్పాటుపై సమితి ప్రతినిధులు చేసిన ప్రతిపాదనలను కమ్యూనిస్టు ప్రతినిధులు పూర్తిగా నిరాకరించారు

—బర్మా సరిహద్దుల మీదుగా యున్నాన్ రాష్ట్రంమీదికి దండెత్తిన 21 వేల జాతీయ చైనాసేనల నెదుర్కోడానికి కమ్యూనిస్టుసేనలు తర్లి వెళ్లాయి

## శుక్రవారం, ఆగష్టు 3 :

— నేపాల్ పశ్చిమభాగంలో అలజడిని అణచడానికి నేపాల్ ప్రభుత్వాహ్వానంపై వెళ్లిన భారతసేనలు ఉపసంహరించబడినవి

—ఇటలీక విధించబడిన సంధి షరతులకంటె జపాన్ సంధి ముసాయిదాలోని షరతులే స్నేహపూరితంగా ఉన్నాయని జపానీస్ ప్రభుత్వం ప్రకటించింది

—పెట్రోలు తగాదాపై చర్చలకోసం బ్రిటిష్ ముడివస్తువుల శాఖామంత్రి రిచర్డు స్టోక్సు టెహరాన్ బయల్దేరారు

—తూర్పు పాకిస్థాన్‌కు విదేశాలనుండి ఆయుధసామగ్రి ఈ సంవత్సరారంభంనుండి విరివిగా రవాణా అవుతున్నట్లు కలకత్తాలో విశ్వసనీయవర్గాలద్వారా తెలుస్తున్నది

## శనివారం, ఆగష్టు 4 ·

—ప్రభుత్వ యాజమాన్యంక్రింద నడిచే పారిశ్రామిక, వ్యాపార సంస్థలకు, ముఖ్యాంశాల్లో మాత్రం ప్రభుత్వాధికారం ఉంచి, మిగిలినంత స్వయం నిర్ణయాధికారం ఇవ్వాలని, దానివల్ల వాటి చిక్కులన్నీ తీరిపోగలవని ఎ డి గోర్వాలా అన్నారు

— పెట్రోలు తగాదాపై చర్చలు జరిపేందుకు రిచర్డు స్టోక్సు నాయకత్వాన బ్రిటిష్ ప్రతినిధివర్గం టెహరాన్ వచ్చింది పర్షియాకు అనుకూలంగాని ఒడంబడికకు ఎన్నటికీ అంగీకరించనని పర్షియా ప్రధాని మొసాదిక్ ప్రకటించారు

—భాషా రాష్ట్రాలను, కంట్రోళ్ల ఎత్తివేతను సమర్థిస్తూ కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీ కేంద్రకార్యవర్గం తీర్మానించింది

—కేసాంగ్ "శాంతి" చర్చల ప్రదేశాన్ని నిస్సైనికంగా ఉంచాలన్న ఒడంబడికను కమ్యూనిస్టులు భగ్నం చేసినందున, దానిపై సంజాయిషీ వచ్చేవరకు చర్చలను నిలిపివేయడానికి సమితి సర్వసేనాని రిడ్జివే నిశ్చయించారు

—ఇండియాపై పాకిస్థాన్ సాగించే యుద్ధప్రచారపు ఉదాహరణలను వరుసగా చూపిస్తూ భారత విదేశాంగశాఖ ఒక శ్వేతపత్రం ప్రకటించింది

—'సి' తరగతి రాష్ట్రాలైన హిమాచలప్రదేశ్, వింధ్యప్రదేశ్, కూర్గ్, అజ్మీర్, ఢిల్లీ, భోపాల్ లలో ఎన్నికల అనంతరం

(47-వ పేజీ చూడండి)

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

## అలెగ్జాండర్ డ్యూమా

## 49

విల్ ఫర్ట్ దర్శనానికి వచ్చాడంటే అదెంతటి అమూల్యమైన గౌరవమో ఆనాటి పారిస్ సమాజంతో పరిచయం కలవారికి చక్కగా తెలుస్తుంది రాజులు మారవచ్చు ప్రభుత్వాలూ, మంత్రులూ మారవచ్చు కాని విల్ ఫర్ట్ ప్రతిపత్తికి ఎన్నడు భంగం కలగలేదు అందరూ అతని వివేకాన్ని ప్రశంసిస్తారు అతనికి శత్రువు లనేకమంది కాని అతనిపట్ల హితం కలవారెవరూ లేక పోయినా అతన్ని కాపాడేవారు లేకపోలేదు న్యాయాధికార వర్గంలో ఉన్నత స్థితిలో ఉన్నాడు, అతని ఇంటిని అతని క్రొత్త భార్య, మొదటిభార్య కుమార్తె శ్రద్ధగా అలంకరించి చక్కగా ఉంచుతారు పురాతన సాంప్రదాయాలను, ఆచారాలను ఆ యింటిలో అందరూ శ్రద్ధగా అనుసరిస్తారు వాస్తవిక జీవనంలో ఉన్నతికి తోడ్పడే లక్షణాలు వ్యక్తులకు సహజంగానే అలవడ్డాయి వ్యర్థపు ఆదర్శాలను, అస్పష్ట మత రాజకీయవాదాలను హేళనతో పరిగణిస్తారు ఇంటిలోనివారు అధిక గౌరవం పొందుతూ అతిథుల్ని తగుమాత్రంగా ఆదరిస్తారు

విల్ ఫర్ట్ తరుచు ఇతరుల నివాసాలకు వెళ్లడు అయితే మిత్రుల్ని కాపాడ్డానికి ఏ పరిస్థితులలోనూ వెనుదియ్యడు శత్రువులకు అతని పేరు చెప్తే భయం మిత్రులూ శత్రులూ కానివారికి అతను న్యాయశాసనాలు మూర్తీభవించిన వ్యక్తి ఏ పరిస్థితులలోనైనా సరే అతను చలించడు ముఖకవళిక మారదు ముఖం చూసి భావాలు కనిపెట్టడం దుస్సాధ్యం కాని ఇతరుల్ని గుండెలు చీల్చి చూస్తున్నట్లు పరికిస్తాడు మానవులపట్ల అతనికి హీనభావం అంగువల్లనే దేశంలో నాలుగుమార్లు ప్రభుత్వం మారినా, అరాచకం సంభవించినా విల్ ఫర్ట్ పదవికి భంగం కలగలేదు సరికదా, నానాటికి ఉన్నతి పొందుతూ వచ్చాడు అతని భాగ్యం పెంపొందుతూవచ్చింది ఏడాదికొకసారి తన ఇంట విందు చేస్తాడు అయితే మహారాజు విందులిస్తే విందులో మహారాజు గంటసేపైనా ఉంటాడు కాని విల్ ఫర్ట్ తన ఇంట్లో ఇచ్చే విందులో పావుగంటకంటె అధికంగా అతిథుల సమక్షంలో ఉండడు విల్ ఫర్ట్ ఎన్నడూ నాటక ప్రదర్శనాలయాల్లో కాని ఉద్యమాలలో కాని సభలలో కాని కనిపించడు

ఆరోజున మాంట్ క్రిస్టో ఇంటికి వచ్చి విల్ ఫర్ట్ ద్వారం వద్ద దిగాడు విల్ ఫర్ట్ వచ్చేసమయానికి మాంట్ క్రిస్టో ఒక పెద్ద మేజాపైన భూగోళచిత్రపటాల్ని పరిచి, సెంట్ పీటర్స్ బర్గ్ నించి చీనాదేశానికి దారి గమనిస్తున్నాడు

ఎప్పటి అలవాటుప్రకారం విల్ ఫర్ట్ కొల్చి కొల్చి అడుగులు వేసుకుంటూ రీవిగా, న్యాయస్థానంలోకి ప్రవేశిస్తున్న మాదిరిగా సావడిలోకి ప్రవేశించాడు మార్సేల్స్ లో చూసినప్పటికీ ఇప్పటికీ వ్యక్తిలో వ్యత్యాసం ఆట్టే లేదు

మాంట్ క్రిస్టో కౌతుకంతో విల్ ఫర్ట్ ని పరికించాడు విల్ ఫర్ట్ కూడా మాంట్ క్రిస్టోని కొంతసేపు పరికించి, న్యాయస్థానంలో ఉపన్యాసమిచ్చే ధోరణిలో ఇలా అన్నాడు.

"నిన్నటిరోజున మీరు నా భార్యకీ, నా కుమారునికీ చేసిన మహోపకారానికి మీకు కృతజ్ఞత ప్రకటించడం నా ధర్మం నా కృతజ్ఞతాపూర్వక వందనాల్ని స్వీకరించవలసిందని ప్రార్థిస్తున్నాను"

చెప్పిన రెండు మాటల్లోనూ అధికారగర్వం, అహంకారం ఉట్టిపడుతున్నాయి మాంట్ క్రిస్టో కనుబొమలు ముడిచి ఇలా సమాధాన మిచ్చాడు:

"అయ్యా, ఒక తల్లికోసం ఆమె బిడ్డని కాపాడగలిగిన అవకాశం లభించినందుకు నాకు ఆనందమయింది జగత్తులో మాతృప్రేమను మించిన ఉత్కృష్టవస్తువు లేదంటారు అయినా ఈ అవకాశంవల్లనైనా తమ దర్శనం లభించడంకూడా నా అదృష్టమే మీరు స్వయంగా ఎవరింటికీ వెళ్ళరని వినికిడి అందువల్ల కృతజ్ఞత ప్రకటించడం మీ ధర్మమని భావించి రావడం నా అదృష్టమే"

ఈ సమాధానం విని విల్ ఫర్ట్ చకితుడైనాడు కొంతసేపటికి తేరుకుని ప్రసంగం మార్చాలనే ఉద్దేశంతో చుట్టూ చూశాడు మేజాపైనున్న భూగోళపటాన్ని చూసి ఇలా అన్నాడు

"మీరు భూగోళపటం పరిశీలిస్తున్నట్లున్నారు మీరు అనేకదేశాలు పర్యటించినట్లున్నారు"

"అవునండి మీరు రోజూ వ్యక్తుల్ని శల్యపరీక్ష చేసినట్లు నేను మానవజాతినంతటినీ పరిశీలించడానికి ప్రయత్నిస్తున్నాను వ్యక్తినిబట్టి మానవజాతిని పరిశీలించడంకంటె మానవజాతినిబట్టి వ్యక్తుల్ని పరిశీలించడం సులువని నా ఉద్దేశం తమరు ఆసీనం స్వీకరించండి"

విల్ ఫర్ట్ ఆసీనుడైనాడు "ఓహో! మీరు తత్వపరిశీలనలోకి దిగుతున్నారు," అన్నాడు తరవాత ఈ ప్రత్యర్థిని ఎలాగైనా ఓడించాలనే పట్టుదలతో పెదవులు బిగబట్టి చివరికి ఇలా అన్నాడు "నిజమే మీ మాదిరిగా నాకూ చెయ్యడానికి పనేదీ లేకపోతే నేనూ ఇంతకంటె ఎక్కువ విలాసాలలో గడిపేవాడినే"

"అదేమిటి అలా అంటారు?" అన్నాడు మాంట్ క్రిస్టో, తడుముకోకుండా "నిజం చెప్పవలసివస్తే మానవు డేమిటి? దూరంనించిచూస్తే కీటకం మాత్రమే నాకేదీ పనిలేదనికదూ మీరన్నారు? మీ పనేమిటో వాస్తవం చెప్పండి? నిజంగా మీరు చేస్తున్నదీ ఒక పనేనని మీ రనుకుంటున్నారా?"

విల్ ఫర్ట్ స్తంభితుడైనాడు ఈ న్యాయాధికారి ఇంత బలమైన ప్రతివాదాన్ని ఎన్నడూ వినలేదు చివరికిలా అన్నాడు

"మీ రెవరో నాకు తెలియదు మీరు కొంతకాలం తూర్పుదేశాలలో గడిపినట్లు చెప్పుకుంటారు నాగరికత లేని దేశాలలో

అనువాదం సీతారామ్

శిక్షావిధానం మీ రెరుగుదురు కాని మా దేశాలలో ఆ శిక్షా విధానాన్ని మా నాగరికత ఎలా మార్చి వేసిందో మీకు తెలియదు "

"తెలుసు, తెలుసు అదంతా తెలుసు అసలు శిక్షావిధానాల్ని పరిశీలించడమే నా పనుల్లో ముఖ్యమైనది నిజంగా ఆ అనాగరిక దేశాల్లో అనుసరించబడే ప్రతీకారవిధానమే, భగవంతుడు విధించిన న్యాయవిధానమని నా ఉద్దేశం "

"మీరు చెప్పిన పద్ధతులు అవలంబిస్తే ఇంక ఈ దేశంలో న్యాయాధికారులు చెయ్యవలసిన పనే ఉండదు "

"చివరి కంతే అవుతుందండి పనులన్నీ సులువుగా నెరవేర్చుకో గలగడమే కదా ఈనాటి పరిశోధన లన్నిటికీ లక్ష్యం !"

ఈలోగా ఇంకా మన శాసనాలే అమల్లో ఉన్నాయిలెండి అనేక దేశాల పూర్వశాసనాలు పరిణామం చెంది ఇవన్నీ ఇప్పుడు వచ్చాయి ఇవి తెలుసుకోవాలంటే చాలా పరిశ్రమ చేసి అభ్యసించవలసిన అవసరం ఉంటుంది తరవాత మనోదార్ఢ్యంకల వ్యక్తులు అవసరమౌతారు "

"ఒప్పుకుంటాను కాని మీరు చెప్పిన ఆ దేశాల శాసనాలూ, ఫ్రెంచివారి శాసనాలూ కూడా నాకు తెలుసును మీకు ఒక్క ఫ్రెంచిదేశపు శాసనాలుమాత్రమే తెలుసును కాబట్టి మీకు నాకంటె ఎక్కువ పనిలేదు నాకు తెలిసినది మీకు తెలియాలంటే మీకు చాలా కాలం పట్టుతుంది "

విల్ ఫర్ట్ తెల్లబోయాడు "అయితే మీ రే ఉద్దేశంతో ఈ శాసనా లన్నిటినీ అభ్యసించారు ?"

మాంట్ క్రస్టో చిరునవ్వు నవ్వాడు "మీ ప్రతిష్ఠంతా నాకు తెలుసుగాని, నిజంగా మీ రింకా అన్ని విషయా ల్నీ మనిషి, సమాజం అనే సంకుచితదృష్టితోనే పరిశీలిస్తున్నారు "

"అంటే ? మీరు చెప్పింది నాకు బోధపడ్డంలేదు "

"అంటే మీరు మీ సమాజంలో మనుషుల్నీ శిక్షావిధానాల్నీ మాత్రం పరిశీలిస్తున్నారు అంటే యంత్రంలోని చక్రాల్నీ ఇతర భాగాల్నీమాత్రం చూస్తున్నారు కాని ఈ యంత్రా లన్నిటినీ నడిపే మూలపురుషుణ్ని గమనించడం లేదు అంతేకాదు మీకు మీ మంత్రులూ మహారాజులూ సంతకాలు చేసిన శాసనాలు మాత్రమే కనపడుతున్నాయి కాని ఈ శాసనాలకీ, ఈ మంత్రులికీ, ఈ మహారాజులికీ అందకుండా అందరికీ పైన భగవంతు డెవరిని ఉంచాడో వారిని మీరు గమనించలేరు భగవంతుడు కొందర్ని కొన్ని కార్యాలనిమిత్తం ఈ భూమికి పంపుతాడు 'నన్నీ కార్యానికి దేవుడే పంపించాడ'ని వాళ్లనుకుంటారు వాళ్లు మీ కెన్నడూ అందరు సుమా !"

విల్ ఫర్ట్ మరింత ఆశ్చర్యపడ్డాడు "అయితే అటువంటి అసాధారణ వ్యక్తుల్లో మీ రొకరని అనుకుంటున్నారా ?"

"ఏం ? ఎందుకనుకోకూడదు ?"

"క్షమించాలి భగవత్కార్యాల నిమిత్తం మీరు వచ్చారనీ, సామాన్య మానవులకంటె అతీతమైన జ్ఞానం మీ కున్నదనీ నేను అనుకోలేదు అయితే ఇంతటి అపారసంపద, ఇంతటి అసాధారణ జ్ఞానం, ప్రజ్ఞ ఉన్న మీరు ఈ తత్వాలు, ఈ భూగోళశాస్త్ర పరిశీలన, దేశపర్యటనలు చేస్తూ కాలం వ్యర్థపుచ్చుతున్నా రెందుకు ?"

"అంతటి ఉన్నతపదవిలో ఉన్న మీరు ఇటువంటి అసాధారణ వ్యక్తుల్ని కనిపెట్టగలగాలి కాని అది కనిపెట్టగల ప్రజ్ఞ మీ కుందా ? కాని మీ సమక్షంలో నిలబడే వ్యక్తుల్ని శల్యపరీక్ష చేయవలసిన మీరు అది కనిపెట్టవలసిన బాధ్యత గుర్తించలేదా ?"

"నిజంగా మీ మాదిరిగా మాట్లాడిన వ్యక్తిని నే నింతవరకూ చూడలేదండి నిజంగా మీ సంగతి నాకు బోధపడ్డంలేదు "

"దీనికి కారణం మీ సంకుచితదృష్టి భగవంతుడు తన కార్యార్థం పంపిన దూతల్ని మీరు గుర్తించలేరన్నమాట "

"అంటే ఇంకా లోకా లున్నాయనీ, దేవదూతలున్నారనీ, అప్పుడప్పుడా దూతలు వచ్చి మానవులమధ్య సంచరిస్తుంటారనీ మీరు నమ్ముతున్నారా ?" అన్నాడు విల్ ఫర్ట్

"తప్పకుండా దూత లెందుకు రాకూడదూ ? మీరు పీలుస్తున్న గాలిని మీరు కంటితో చూడగలరా ? కాని ఆ గాలి లేకపోతే మీరు క్షణం జీవించలేరు "

"అయితే మీరు చెప్పే దేవదూతల్ని మనం కంటితో చూడలేమా ?

"చూడగలం దేవుడు అలా కోరినప్పుడు ఆ దూతలు ఆకారాలు ధరించివస్తారు వారు మనమధ్య తిరుగుతారు మనం వారితో మాట్లాడతాం కూడా "

"అటువంటి దూతలు వచ్చేటప్పుడు ముందు తెలిస్తే బాగుండును "

"ముందే తెలుపుతున్నాను "

"అయితే ఆ దూతలలో మీరొకరా ?"

"అవును అవునని నాకు విశ్వాసం ఉంది ఎందువల్లనంటే ఇంతవరకూ నాస్థితిలో ఉన్న వ్యక్తి ఎవరూ నాకంట పడలేదు మహారాజుల రాజ్యాలకు హద్దులున్నాయి వారి భాషలకు సాంప్రదాయాలకు హద్దులున్నాయి కాని నా రాజ్యం సర్వప్రపంచ వ్యాప్తం సర్వభాషలూ సర్వసాంప్రదాయాలూ నాకు చెందినవే నాదొక దేశమనేది లేదు ఏదేశంలో జన్మించానో ఏదేశానికీ తెలియదు ఏదేశంలో నాకు మృత్యువు ప్రాప్తిస్తుందో భగవంతునికే తెలియాలి నేను సర్వదేశాల సంప్రదాయాలూ అనుసరిస్తాను సర్వభాషలూ ప్రసంగించగలను నేనే ప్రభుత్వ సంరక్షణా కోరను నాకే మానవుడూ ప్రత్యేకంగా సోదరుడు కాడు, స్వజాతీయుడు కాడు నన్నెవరూ నిర్బంధించలేరు ఏశక్తీ నన్ను తాకలేదు నన్నెవరూ జయించలేరు నాకిద్దరే ప్రత్యర్థులున్నారు, కాలం, దూరం మూడోది భయంకరమైనది ఒకటుంది అది మృత్యువు మృత్యువొక్కటే నన్ను నాజీవనజైత్రయాత్రలో నిరోధించగలిగేది కాని అది నన్ను జయించేలోగా నా కార్యాలు నిర్వర్తించుకుంటాను మానవులు చెప్పుకునే అదృష్టం, దురదృష్టం, నాశనం, పరాజయం మొదలైనవి నన్ను సమీపించవు అందువల్లనే మహారాజుల నోటకూడా వినలేనిమాటల్ని మీరు నానోట వింటున్నారు అందువల్లనే ఇతరమానవులమాదిరిగా 'ఎప్పుడో న్యాయాధికారిదయతో నా కవసరం ఉంటుంది' అని నేను అనుకోను "

"అదెల్లాగ చెప్పగలరు ? మీ రిప్పుడు ఫ్రెంచిదేశంలో ఉన్నారు మీరు ఫ్రెంచిశాసనాలకి లోబడి ఉన్నారు కదా ?"

"అది నాకు తెలుసును నే నొక దేశం దర్శిస్తున్నప్పుడు ఆ దేశంలో శాసనాల్ని న్యాయాధికారులకంటె జాగ్రత్తగా పరిశీలిస్తాను అందువల్ల నాకంటె న్యాయాధికారులే ఎక్కువ జంకవలసివస్తుంది "

"అంటే మీ ఉద్దేశంలో మానవుడు సహజంగా దుర్బలుడనీ, ప్రతివ్యక్తీ ఎప్పుడో ఒకప్పుడు పొరపాట్లు చేసిఉంటాడని మీ అభిప్రాయమా ?" అన్నాడు విల్ ఫర్ట్

"అవును పొరపాట్లు, పాపాలు, నేరాలు చేసేఉంటారు "

(48-వ పేజీ చూడండి)

**కథానిక:**

# శీతనిబాధ

**శ్రీ ఆకుండి నారాయణమూర్తి**

“చూసేరా రవణమ్మగారూ!. కౌమాతుమ్మగారు ఇవాళ కూడా రాలేదు రోజూ మీ అందరికన్నా ముందు అవిడే వచ్చేసేవారు” అంది శీతమ్మ విస్తరంటలు కుడుతూ

“నేనూ అదే ఆలోచిస్తున్నాను చూసేరా అవిడతోపాటు వెంకాయమ్మ కూడా రాలేదు మీఇంటికి రోజూ రావడానికి వాళ్లకు నామోషీగాబోలు!” అంది రవణమ్మ ఈనపుల్లలు చీలుస్తూ

“అదేం సోద్యమండీ! రోజూ వస్తున్నారుగా. ఏదో పనిపాటులు చక్కబెట్టుకొని నలుగురం రోజూ ఓదగ్గర కలుసుకొని ముచ్చటగా ఏదో మాట్లాడుకోకుండా, ఎవళ్లింటి దగ్గర వాళ్లు ఒంటిపిల్లి రాకాసుల లాగ కూర్చుంటే ఏం ఊసుపోతుంది చెప్పండీ పల్లెటూళ్లో!”

“మీరన్నట్టు రోజూ వస్తూ వస్తూ ఏ కారణం లేకుండా చప్పనరావడం మానేస్తే ఏమనుకోడం! అదీకాక రెండు రోజుల క్రిందటివరకూ లేని నామోషీ ఇప్పుడొచ్చిపడిం దేమిటి మీఇంటికి రావడానికి?” తన విమర్శకు తిరిగి ప్రతివిమర్శ లేదన్నట్లు గర్వంతో శీతమ్మ వేపు చూచింది రవణమ్మ

“నిన్నసాయంత్రం మాత్రం కౌమాతుమ్మగారు మాఇంటికొచ్చి, నాకూతురితో ఆడుకుంటున్న ఆమెకూతురు పాపలుని తీసుకెళ్లిపోయింది-‘ఏమండీ, ఆడుకుంటున్న పిల్లనలా తీసుకెళ్లిపోతున్నారు?’ అని నేనడిగేను ‘రత్నందగ్గర గాజు పెంకొందుకండీ?’ అని గొణుక్కుంటూ చరచరా వెళిపోయిందావిడ! అదేం సోద్దెమండీ-నాకిప్పటికీ అర్థంకాలేదుసుమండీ ఆమెవైఖరి” అనులు దొంతి పెడుతూ అంది శీతమ్మ

“ఓహో! అలా చెప్పండి మరి.! ఇప్పుడు నాకంతా అర్థమయింది. ఇదంతా ఆవెంకాయమ్మ ఆడిస్తున్న నాటకం”

“ఏమిటది?! నాకేం అర్థంకాలేదు. కొంచెం త్వరగా చెప్పండీ!”

“మొన్న వెంకాయమ్మ మాయింటికి వచ్చింది ఏవో మాటలమీద మాటలొచ్చి శీతమ్మగారి కూతురు ఉమ మంచి అందంగా ఉంటుందన్నాను నేను-“అబ్బె, శీతమ్మగారి కూతురేం బాగుంటుందండీ, బూరి బుగ్గలూ అదీని! కౌమాతుమ్మగారి కూతురు పాపలు చాలా అందంగా ఉంటుంది ఎంతో ముద్దొస్తూ చక్కగా ఉంటుంది పాపలు!” అని అంది వెంకాయమ్మ చేతులాడిస్తూ నాకెంతేనా వళ్ళు మండిందిసుమండీ! కళ్లతో చూస్తూ కూడా ఆ పక్షపాత బుద్ధితో ఆపేలాప నేమా అని నాకెంతేనా చికాకేసింది “ఛీ!. ఆపిల్ల ఎలా మీకంటికి నచ్చిందండీ అడుసు కళ్లూ అదీని!” అని నేనన్నాను ఛర్ మని నాగుపాములే దాని స్వంతకూతుర్ని అన్నట్లు లేచిపోయిందండీ! ఎంతకోపంవస్తేమాత్రం అది నన్నేం చేయగలదు మహా! ఆ కోపంతో కౌమాతుమ్మదగ్గరకు వెళ్లి, మీమీదా, నామీదా లేనిపోనివన్నీ కల్పించి చెప్పి ఆమెకు మనమీద కోపం వచ్చేటట్లు చేసుంటుంది!-కౌమాతుమ్మగారూ, వెంకాయమ్మా ఎందుకు ఇక్కడికి రాలేదో ఇప్పుడు మీకు బోధపడుతుంది!”

“ఇదేం విడ్డూరమండీ! మీరూ మీరూ ఏదో వాదించుకుంటే మధ్యనా మీదెందుకూ కౌమాతుమ్మగారికి కోపం? నేనేమయినా, ‘నాకూతురే ఆమె కూతురికన్నా బాగుంటుంద’ని అన్నానా? మధ్య మీరూ, వెంకాయమ్మా మీమీ ఉద్దేశ్యాల ప్రకారం వాదించుకున్నారు ఆవిషయంలో నాతప్పేముంది మహా!” అంది శీతమ్మ ఆశ్చర్యంతో.

“ఛీ!. అదొక్కటే కారణం అయుండదండీ!-నేనంటే వెంకాయమ్మకు ఓకమొయ్యా కోపం ఉంది నాకు మీరు చాలా సన్నిహితులవడం చేత, నేను చెప్పినట్లు మీరు వింటూ ఉండడం చేత ఆమె ప్రతిభేమీ బయటకు రాకుండా ఉంది. అంచేత మెల్లగా కౌమాతుమ్మను దువ్వి, ఆమెతలకు లేనిపోనివన్నీ ఎక్కించి, ఇక్కడకు రాకుండా ఉన్నట్లు చేసి కౌమాతుమ్మ ఇంటిదగ్గరే కొందరమ్మలక్కలను ప్రోగుచేసుకొని తన ప్రతిభను పెరిగించుకుందామనుకుంటున్నాది కాబోలు వెంకాయమ్మ” అంది రవణమ్మ

“బాగానే ఉంది వరస! కాస్త చదువుకున్నప్పటికీ కౌమాతుమ్మగారు అంత లోకజ్ఞానం లేకుండా ఉన్నారేమండీ!.. లోకులు అనుకోరూ వాళ్లకు తోచినట్లు?- అంతమాత్రంలో ఈ ఆగ్రహం అలకా మధ్య నామీదెందుకు?. కావలిస్తే ‘మీకూతురే నాకూతురికన్నా అందమయిన ద’ని వందసార్లు, ఆమెముందు కూర్చొని అంటాను రకరకాలుగా వర్ణించేస్తాను. అక్కడికి తీరుతుందా ఆమె అలక!”

“ఆ వెంకాయమ్మ వట్టి ఇచ్చకాలమనిషండీ! కౌమాతుమ్మ మనస్సు ఆమె పూర్తిగా విరిచేసుంటుంది!”

“సరే, ఏదో కనుక్కుంటాను సంగతంతా! అరె! అప్పుడే పొద్దుపోయిందే! మాఆయన ఇవాళ సినీమాకు వెళతానన్నారు వేగిరం వంటచేయాలి” అంటూ విస్తరంటలు దొంతి పెట్టింది శీతమ్మ.

* * * *

## 2

ఆసాయంత్రం కౌమాతుమ్మ ఇంటికి వెళ్లి సంగతి సందర్భాలు కనుక్కోవడమా, మానేయడమా అనే సమస్యలో పడింది శీతమ్మ!. అదివరకు తనకూ కౌమాతుమ్మకూ ఏమయినా వైరముందా?-లేదే!- మరలాంటప్పుడు ప్రతీరోజూ వచ్చే కౌమాతుమ్మ రెండురోజులయి రాకపోయినప్పుడు, ఎందుకు రాలేదో కనుక్కొనే అందుకు వెళ్లడంలో తప్పేముంది?-ఆమె ఎందుకు తనింటికి రావడం మానేసిందో తనకు తెలుసుగా! మరలాంటప్పుడు తనక్కడకు వెళ్లడంవల్ల ఏమయినా లాభం ఉందా? కొన్నాళ్లు పాతబడితే మళ్లీ ఆమె ఎప్పట్లాగే తనింటికొస్తుందని ఏమిటా నమ్మకం? శీతమ్మకేమీ అర్థంకాలేదు-

(36-వ పేజీ చూడండి)

 



# తీర్చని ఋణం

"అమరశ్రీ"

మొదటిదృశ్యం

(గదిలో)

కుటుంబరావు ఇంతకీ ఏమంటావురా?

ప్రసాద్ నన్నేమన మంటావన్నాయ్?

కుటుం: అయితే, నేననమన్నదంతా అంటావన్నమాట

ప్రసా అది కాదన్నాయ్ నాకేం తెలుసుచెప్పు?

కుటుం అలాగంటే ఎలారా? పెద్దవాడివి కాస్తోకూస్తో చదువుకున్న వాడివి నాకేంతెలుసనంటే? నీకు తెలియకపోతే ఎవరికి తెలుస్తుందిరా?

ప్రసా నాకు తెలిసినవిషయాలు వేరే ఉన్నాయ్ ఇటువంటి విషయాలు నాకేం తెలుసు!

కుటుం కుటుంబవిషయాలు గూడ తెలుసుకోకుండా ఉంటావంటే ఎలారా?

ప్రసా ఫలానా అని చెప్పన్నాయ్ నువ్వుచెప్పనట్లు చెయ్యకపోతే అప్పుడను

కుటుం నువ్వుచెప్పనట్టే చేశాను నాదేమున్నదంటావు అప్పుతేమన్నా వస్తే?

ప్రసా అన్నిటికీ అన్నిమాటలు చెబితే నేనేంచేస్తాను?

కుటుం అసలు మనకుటుంబ విషయం నీకేం తెలుసోచెప్పు (కాస్సేపాగి) అదంతా ఇప్పుడెందుకవసరం నిన్న నీకు పిల్లనివ్వటానికి ఎవరో వచ్చారు తెలుసా?

ప్రసా: రాత్రి భోజనం చేసేటప్పుడు వదిన చెప్పింది

కుటుం ఏమని?

ప్రసా నీకు పిల్లనివ్వటానికెవరో 'ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరుగారు వచ్చి పోయారని చెప్పింది

కుటుం అంతేనా?

ప్రసా: తరువాత నేనడగనూలేదు వదిన చెప్పనూలేదు

కుటుం: అసలు ఈవిషయంలో ఖచ్చితంగా నీ అభిప్రాయమేమిటిరా? నీకున్నా, అమ్మాయికీ పెళ్ళిచేదామని కాళ్లకు బలపాలు కట్టుకొని నేను తిరుగుతుంటే, ముభావంగా అంటీ అంటనట్లు తిరగటంలో నీ ఉద్దేశ్యం?

ప్రసా ఫలానాపని చెయ్యమని చెప్పి, చెయ్యకపోతే అడిగితే బాగుంటుంది

కుటుం (విసుగ్గా) జరిగిందేదో జరిగిపోయింది అసలు ఈ సంబంధం విషయంలో నీ అభిప్రాయం చెప్పు

ప్రసా అసలు నిజం చెప్పాలంటే నాకు పెళ్ళిచేసుకోవాలని లేదన్నాయ్

కుటుం నే ననుకుంటూనే ఉన్నా ఈమాట కాస్తా అనేస్తావని పెళ్ళిచేసుకోనని ఖచ్చితంగా చెప్పేశావటగా, మీ వదినతో

ప్రసా అవును (మెల్లగా)

కుటుం నీవు పెళ్ళి మానేస్తే అమ్మాయి పెళ్ళికూడ మానివేయవలసివస్తుంది మానివేయడమేమిటి? నీ పెళ్ళి కాందే అమ్మాయి పెళ్ళికాదు

ప్రసా అదేమిటన్నాయ్? (ఆశ్చర్యంగా)

కుటుం: అంతేరా! మన పరిస్థితులు నీకు తెలియనివేంకావుగా!

ప్రసా అంటే?

కుటుం పసివాడడిగిన ట్లడిగితే నేను మాత్రం ఏంచెప్పేది?

ప్రసా అంటే, డబ్బువిషయంలోనా నీ సందేహం?

కుటుం అది తప్ప మరేమున్నది? అది లేదుగాబట్టే

ప్రసా నాపెళ్ళిసంగతి తరువాత చూసుకుందాంలే ముందర అమ్మాయి పెళ్ళి విషయం చూడు

కుటుం ముందర అమ్మాయిపెళ్ళి చూడాలిగాబట్టే నీ పెళ్ళికూడ అవసరమంటున్నది'

ప్రసా: పెళ్ళిఖర్చులకు కూడ, డబ్బు లేదా ఏమిటి?

కుటుం నీకు తెలియకుండా ఎక్కడ ఉన్నదిచెప్పు? (కోపంగా)

ప్రసా: కోప్పడకన్నాయ్! తెలియక అడుగుతున్నాను

కుటుం రెండేళ్లక్రితం నాన్న చనిపోయేనాటికి పదివేల రూపాయల అప్పూ, నాలుగెకరాల పొలమూ మిగిలిన సంగతి

నీకుకూడ తెలుసుగా అప్పు తీర్చగా ఒక రెండు వేలు మిగిలింది

ప్రసా : పెళ్లిఖర్చులకు రెండు వేలు చాలవూ ?

కుటుం : ఈ కుటుంబంతో నేను కూడ వెనక వేసుకోలేకపోవటం నీవు చూస్తునే ఉన్నావుగా

ప్రసా అదికాదన్నాయ్ నీవు అబద్ధం చెపుతున్నావని కాదు నా ఉద్దేశ్యం

కుటుం నువ్వే మనుకున్నా నాకిష్టమే. అసలు విషయం ఇదని చెపుతున్నాను

ప్రసా ఆ రెండు వేలు పెట్టి అమ్మాయి పెళ్లి చెయ్యన్నాయ్ నా పెళ్లివిషయం తరువాత చూసుకుందాం నా పెళ్లికి డబ్బు లేకపోయినా ఫరవా లేదులే

కుటుం రెండు వేలు పెట్టి పెళ్లిచేయటం ఎలా ఈ రోజుల్లో

ప్రసా అమ్మాయికి పెళ్లికూడ కాదా, ఆ రెండువేలతో ?

కుటుం. కాదా అంటే ఏంచేసేది ? అదేమన్నా నాచేతులలో ఉన్నపని గనుకనా

ప్రసా : ఒక పెళ్లికూడ కావటం అసాధ్యమయినపుడు నా పెళ్లెందుకు మరి ?

కుటుం అమ్మాయిపెళ్లికి రెండు వేల రూపాయిల కట్నం కావాలి మరో వెయ్యి రూపాయలు ఖర్చులకు కావాలి మొత్తంమీద

ప్రసా అసలు కావలసిన డబ్బుకీ, నా పెళ్లికీ ఏమిటి సంబంధం ?

కుటుం నిన్న నీకు పిల్లనిస్తామని వచ్చిన 'ఇఁకమ్‌టాక్సు' ఆఫీసరు నీకు మూడు వేల రూపాయలు కట్నమిస్తానన్నాడు

ప్రసా ఆయన దగ్గరనుంచి కట్నం తీసుకొని దీనికి ఉపయోగపరచుకోవాలన్న మాట

కుటుం (శాంతంగా) పోనీ, అంతకంటె మంచి మార్గమేదైనా ఉంటే చెప్పు నీ ఇష్టం వచ్చినట్లే చేదాము

ప్రసా (ఆదుర్దాగా) నా ఇష్టం కాదన్నాయ్, కావలసింది మరో విధంగా అమ్మాయిపెళ్లి పూర్తికావటానికవకాశం లేదూ ?

కుటుం ఉన్నదేమో నువ్వే ఆలోచించి చెప్పు

ప్రసా ఇంత ఆదుర్దాగా ముందు వెనుకలాలోచించకుండా పెళ్లిచేసుకోవటం నాకిష్టంలేదు

కుటుం వెంటనే అంగీకరించమని, నిన్ను నేను అనటంలేదు బుద్ధిఉన్నవాడెవడూ అనడా మాట (కోపంగా)

ప్రసా : కోప్పడకన్నాయ్ !

కుటుంబ కోపం గాదురా! కళ్లు మూసుకొని భావిలో దూకమని నేను మాత్రం ఎలా అంటాను? అదీగాక నేను పరాయివాడినా? నీ నాశనం కోరటానికి విచారించి వచ్చితేనే మాట ఇద్దాం

ప్రసా అసలు నాకు పెళ్లిచేసుకోవాలనే ఉద్దేశ్యమే లేదన్నాయ్

కుటుం పెళ్లిచేసుకోవాలనే ఉద్దేశ్యం ఉండట మేమిట ?

ప్రసా : అసలు పెళ్లి చేసుకోను (దృఢంగా)

కుటుం : కారణం ?

ప్రసా కారణం ? (వెటకారంగా) కారణం నేనే నా పరిస్థితులే కారణం

కుటుం : అతివృష్టి, అనావృష్టి మాట్లాడితే అర్థం కాకుండా ఈవిధంగా మాట్లాడతావు లేకపోతే అసలు లేదు

ప్రసా నా చదువు పూర్తికాందే పెళ్లి చేసుకోను అసలు నా కెందుకో పెళ్లి చేసుకోవాలని లేదు ఎమ్ ఎ పూర్తి చేసి

కుటుం అది రెండు సంవత్సరాల తరువాత మాట

ప్రసా (ప్రశాంతంగా) అవును

కుటుం అసలు చదవటానికి మాత్రం డబ్బేది ?

ప్రసా (నిస్పృహగా) అది కూడ నిజమే

కుటుం నేను చెప్పవలసిన విషయం మరొకటి ఉన్నది మీఇద్దరి పెళ్లిళ్లు చేసేశానంటే ఏదోవిధంగా నా భారం కూడ తీరిపోతుంది

ప్రసా. అందుకేనా ఇలా త్వరపడటం?

కుటుం : అందుకోసమని మీకు మంచి సంబంధాలు లేకపోతే నాది ఆ తప్పు

ప్రసా : నేను పెళ్లిచేసుకోలేను అది తప్ప నీవు మరేపని చేయమన్నా చేస్తా

కుటుం ఇటు చూడరా ప్రసాద్ ! నా కోసం నీవు ఒక్కపని కూడ చెయ్యనక్కర లేదు మన ఇద్దరికోసం చేయమంటున్నాను ఈ పని

ప్రసా. మరి నా చదువు సంగతి ?

కుటుం నన్నడిగితే నేనేం చెప్పను ? నా పరిస్థితి నీకు తెలుసుగా

ప్రసా : ఇంతటితో స్వస్తి చెప్పమంటావా ?

కుటుం నేను చేయగలిగిన సహాయమేదో చెప్పు చేస్తాను

ప్రసా వచ్చే కట్నంలో సగం నాకివ్వు 'ఎమ్ ఎ' పూర్తిచేసుకుంటాను

కుటుం : ఆ ఇచ్చే మూడువేలే అస్తుబిస్తుగా సరిపోతాయో, సరిపోవో ననుకుంటుంటే, ఇదెలా చెప్పరా ?

ప్రసా నన్నేంచేయమన్నావన్నాయ్? చదువు లేకపోతే నాజీవితం నాశనమవుతుంది

కుటుం అయితే, చదువులేని వాళ్లందరి జీవితాలూ నాశనమవుతున్నాయా ?

ప్రసా (వ్యంగ్యంగా) కావు

కుటుం : వీటన్నిటితోపాటు నాకొక బాధ్యతకూడ ఏడిచింది

ప్రసా ఎవడన్నాడు, నా పెళ్లిచెయ్యవలసిన బాధ్యత నీమీద ఉన్నదని ?

కుటుం ఇప్పుడెవడుమాత్రం ఎందుకంటాడు ? నీ పెళ్లికాని రోజున అంటాడు ప్రతివాడూ

ప్రసా ఎవడో అంటాడని, నీవు నా పెళ్లిచేయాలని పట్టుదల పట్టావన్నమాట ?

కుటుం ఇక నీవీ విధంగా విపరీతార్థాలు తీస్తే నేనేం చేసేది?

ప్రసా నన్ను మాత్రం విడిచిపెట్టన్నాయ్, ఈ విషయంలో

కుటుం నేను బయటపడే మార్గం చూపించు నీవు చేయమన్న పని చేస్తాను

ప్రసా నా విషయం చూసుకోవటానికే నేనశక్తుడయినపుడు, మరొకరి విషయం ఎలా ఆలోచిస్తాను?

కుటుం ఆ పెళ్లివారు రేపు వచ్చి పిల్లను చూసుకుపొమ్మన్నారు

ప్రసా నాకు పదిహేను వందల రూపాయలు చాలన్నాయ్ సగం వాళ్లిచ్చే దానిలో సగం మాత్రం

కుటుం కట్నం లేకుండా అమ్మాయిని పెళ్లి చేసుకునేవాళ్లు కనబడితే నిన్నసలు ఏ విషయమూ అడగవలసిన పని ఉండేదే కాదు

ప్రసా అంత కష్టంగా మాట్లాడతావేం అన్నాయ్ !

కుటుం : కష్టం లేదు సుఖం లేదు.

ప్రసా మరి నా విషయం

కుటుం (అందుకొని) ఏం చెప్పమంటావ్ ?

(43-వ పేజీచూడండి)

కథానిక:

# కొత్త చీర

శ్రీ ఓగేటి శివరామకృష్ణ

భర్త తన తండ్రిచేత గ్రామఫోను కొనిపించినందుకు-లలిత మనస్సులో చాలా బాధపడింది పోనీ కొనిపించికొన్న వాడు తిన్నగా ఉండక-మామ తెచ్చిన గ్రామఫోను స్నేహితునికిచ్చి-పాత గ్రామఫోను ధర్మారాయుడు తనయింట ఉంచుకొన్నాడు తన తండ్రి గ్రామఫోను కొని యిచ్చినప్పుడు యీ విధంగా అతడు చేయటం లలితకు యిష్టంలేదు అయితే ఆడదికాదూ అందువల్ల 'ఏమయితేం కొనిపించుకొన్నారుగా మా యదారి గ్రామఫోను-మీ అక్కసు తీరిందా?' అంటూ తన అక్కసు చూపింది

తండ్రిచేత డబ్బు ఖర్చు పెట్టించి, గ్రామఫోను కొనిపించి నందుకు గాను-లలిత యీ విధంగా బాధపడుతున్నదని ధర్మారాయుడు గ్రహించాడు నవ్వు వచ్చిందతనికి నవ్వుతూ తడుముకోకుండా అన్నాడతను "ఏం కొని పెట్టినందుకు మీ నాన్న యేం బాధ పొందినట్లుగా కన్పించలేదు గాని-నీవుమాత్రం ప్రశ్నించి-నీ అక్కసు వెళ్లబోసుకొన్నావ్' అని

ఈసారి లలితకు నిజంగా ఉక్రోషం వచ్చింది మీరే చెప్పండి-రాసట్లయితే-'మధ్య కొనిచ్చిన వాడాయన-పిన్నులూ, ప్లేటులూ తగలేసి, ఆనందాన్ని అఘోరిస్తున్న వారు మీరు మధ్య మరి నాకెందుకూ అక్కసు?-' అంటుందా?

ధర్మారాయుడు తిరిగి నవ్వుతూ అన్నాడు "అవున్లే-అలా జవాబు చెప్పటాన్నే-అలా ఉద్రేకంతో అనటాన్నే ఉడుకుమోతుతనం అంటారు'

'చాల్లెండి'-అంది రుసరుస లాడుతూ లలిత ధర్మారాయుడు గూడా అప్పటికి ఊరుకొన్నాడు అయితే లలితమాత్రం-యేదో ఆలోచన సాయంత్రంవరకూ చేస్తూనే ఉండిపోయింది ఇదంతా ధర్మారాయుడు ఆఫీసు కెళ్లబోయే సమయంలో-మధ్యాహ్నం పదకొండు గంటలవేళ!

చీకటి పడింది ఎప్పుడూ చూపని శ్రద్ధతో లలిత తన పనులు నిర్వర్తించుకొంది ధర్మారాయుడు ఆఫీసునుండి వచ్చి రావటంతోటే-వేడినీళ్లు తోడిచ్చింది స్వయంగా సబ్బుతో వీపు తోమింది తుడుచుకొనటానికి యిస్త్రీ తుండు తెచ్చి యిచ్చింది గడ్డపెరుగు వడ్డన చేసింది అడ్డదిడ్డంగా ప్రశ్నలు వేసి తికమకలు పెట్టే ఆమె కనీసం భోజనం వేళ యే ప్రశ్నలూ తీసుకొని రాలేదు సరిగదా-ధర్మారాయుడు యెత్తిన విషయానికల్లా సదుత్తరాన్నిచ్చింది

ధర్మారాయుడు అసాధ్యుడని చెప్పక తప్పదు ఆవలిస్తే పేగులు లెక్కపెట్టే రకం ధర్మారాయుడు కాకపోతే 'ఏమిటే-అలా ఉషారుగా ఉన్నావ్ ఏమిటీ విశేషం'-అనయినా ప్రశ్నించకుండా ఉంటాడా? అడగలేదు సరిగదా-మామూలుగా భోజనంచేసి-తనపని చేసుకొన సాగాడు

లలిత, ధర్మారాయుడా విధంగా ముభావంగా ఉంటాడనుకోలేదు 'ఏం అలా ఉషారుగా ఉన్నావ్?' అని ప్రశ్నిస్తాడనుకొంది

దానిమీద తాను-తన ఉద్దేశాన్ని తెలియపర్చుదామనుకొంది, 'మీరు మా నాన్న చేత గ్రామఫోను కొనిపించుకొన్నారుగదా-నాకో మంచిరకం చీర కొనిపెట్టండి' అని అడుగుదామనుకొంది

ధర్మారాయుడు యోచించి 'సరే'-నంటాడని ఆమె భావించింది అందుకనే ఆవిధంగా పథకం తయారుచేస్త!

కాని ధర్మారాయుడు అఖండుడుగదా! ఏ ప్రశ్నా వేయలేదు తములపాకు లయినా తెచ్చి యివ్వవలసిందని కోరలేదు ఆఫీసు వర్కు చేసుకొంటూ బజారునుంచి కొని తెచ్చుకొన్న కిళ్లీనమల సాగాడు

లలిత ప్రథమ ప్రయత్నం కొనసాగలేదు! పట్టపట్టి, బలవంతంచేసి తండ్రిచేత గ్రామఫోను కొనిపించుకొన్నప్పుడు-తానుగూడా అదేవిధంగా బలవంతంచేసి, పట్టుపట్టి కొత్తచీర కొనిపించుకొని తీరాలనుకొంది ప్రథమ ప్రయత్నంలో విఘ్నం కల్గినంత మాత్రాన, బెదరగూడదనుకొంది

తాంబూలం వేసుకొనటం భోజనం అవటంతోటే ధర్మారాయుడికి అలవాటుగదా! అప్పుడు తన్ను కేక వేస్తాడు-అప్పుడు విషయం కదపవచ్చు-అని యేమో ఊహించింది కాని ధర్మారాయుడు కిళ్లీ తెచ్చుకొని వేసుకొన్నాడుగదా! అందువల్ల మరి తాంబూల అవసరమే కల్గలేదు.

ధర్మారాయుడు అడగకుండే సరికి-మరి లలితే ఆవిషయాన్ని యెత్తవలసి వచ్చింది. భర్తచేత విషయం తెల్పి 'అవును కాదు'-అనిపించుకొని విషయం తేల్చుకొనాలని ఆమె ఆరాటం అందువల్ల భోజనం పూర్తి చేయకుండానే-ధర్మారాయుడి దగ్గరకు వచ్చి ఇదిగో వక్కపొడి అని యివ్వబోయింది

ఏదో పని గట్టుకొని వచ్చిందిగదా, తెచ్చిందిగదా అనయినా ఊహించి ధర్మారాయుడు వక్కపొడి తీసుకొంటే బాగుండిపోను లలిత-యెంతో సంతోషించి ఉండేది అలా యోచనయినా కనీసం చేయకుండా 'అవసరంలేదు కిళ్లీ తీసుకొన్నా'-అని కట్టె విరిచి పొయ్యిలో పెట్టినట్లుగా మాట్లాడాడు

'సరే-అయితే-' అంది లలిత అప్పుడే ఆమెలో చిరుకోపం ప్రవేశించింది. రెండు ప్రయత్నాలు విఘ్నమయిపోయాయ్ అంతటితో ఊరుకొంటానికి లలితమనస్సు ఒప్పలేదు

ధర్మారాయుడుమాత్రం విషయం ఊహించాడు లలిత తన్ను యేదో కోరదలచుతున్నదని, చెప్పటానికి తికమకలు పడుతున్నదనీ, యిటూ, అటూ పచారుచేస్తున్నదనీ గ్రహించాడు!

-అయితే ఆమె అడిగిన మీదట తన యిష్టమయితే అంగీకారం తెల్పుదామనుకొన్నాడు ధర్మారాయుడు

వంటయింటిపని పూర్తిచేసుకోంటూ-ఆలోచనచేసి, ఆలోచనలో కృతకృత్యురాలయింది లలిత! ధర్మా యుడు ఆఫీసు పని ముగించుకొని, కుర్చీలో కూర్చుని, ఆవలిస్తూ, ఆమె ప్రశ్నకోసం యెదురుచూస్తున్నాడు

తెల్లటిచీర కట్టుకొని, గులాబీరంగు జాకెటు తొడుగుకొని, తాంబూలం వేసుకొని, తల్లో మల్లిపువ్వులు ఘుమఘుమలాడుతూంటే-అపర రతీదేవిలా తయారయి లలిత ధర్మారాయుడు ముందునిలబడింది! ధర్మారాయుడు కనీసం ఆమెను

చూడటంతోనే-యెన్నో ప్రశ్నలు వేయవలసి ఉండింది కాని ప్రశ్నించకుండా క్రీగంటితోనే చూస్తూ ఉండిపోయాడు ధర్మారాయుడు

'ఏమండీ!' గత్యంతరంలేక-తన అభిప్రాయం తెల్పటంకోసం లలితే మాట్లాడవలసి వచ్చింది

'ఏం'- అన్నాడు ధర్మారాయుడు-అతడిస్వరం కఠోరంగా ఉన్నదని చెప్పక తప్పదు

'అంతా మోటుతనం- ఆమాట లేమిటండీ-కాస్త నెమ్మదిగా అంటే యేం కొంపలంటుకు పోతాయ్' అంది లలిత

'నెమ్మది నాదగ్గ రెక్కడ ఉంటుంది తండ్రికి తగ్గకూతురవ్ నీదగ్గర ఉండాలిగాని'-అన్నాడు ధర్మారాయుడు విషయాన్నుంచి-మరో కొత్తదానికి సంభాషణ దారి తీసుబోతూంది

లలిత తన యుద్దేశాన్ని వెడలగ్రక్క వలయుననే ఆ దుర్దాతో ఉంది అంగువల్ల మరి అడ్డదారి వ్యాపారం చెయ్యకుండా 'మీరెప్పుడూ యింతే ఎప్పుడూ యీలాంటి దెప్పు పొడుపుడుమాటలే ముచ్చటగా యింతవరకూ-కనీసం ఒక సినీమాకయినా తీసుకొని వెళ్ళలేదు-కాపురానికొచ్చి ఆరు మాసాలకాల మయిందిగాని'- అని అంది

ధర్మారాయుడు మరోవిధంగా ఊహించాడు ఆమె కోరుకొనేది ఒక సినీమాయే గదా అని అనుకొన్నాడు-నిజంగా తానామెను సినీమాకు ఒకమారుగూడా తీసుకొని వెళ్ళకపోయినమాట వాస్తవం తనకూ సినీమాకు వెళ్ళాలని, చూడాలని, కుతూహలత ఉంది కాని ఏమిటో మందకొడిగా ఉండిపోతున్నాడు

'ఓస్ దానికేం-యిప్పుడింకా తొమ్మిదిన్నరే-పదిగంటలకు ఆట వదులుతారు పద పోదాం' అన్నాడు ధర్మారాయుడు

కథ అనుకూలంగా నడుస్తున్నందుకు-లలిత లోలోపల చాలా సంతోషించింది నిజంగా తనకు సినీమాకు వెళ్ళాలనే కుతూహలం ఉంటేగా!

'సినీమాకేం లెండి తీసుకొని వెళ్ళినా వెళ్ళకపోయినా తీసుకొని వెళ్ళినట్లుగా మాటన్నారు చాలు సరే నాకోర్కె ఒకటుంది తప్పకుండా తీర్చాలి-' అంది లలిత

ప్లేటు మారినందుకు ధర్మారాయుడు ఆశ్చర్యపోయాడు

'అసలు యేమిటో చెప్పు'-అని ప్రశ్నించాడతను

'కోర్కె తీరుస్తానంటే-'

'అలాగే యేమిటో చెప్పు'-అన్నాడతను

లలిత కోర్కె వెల్లడించేముందుగా యింకోవిషయం యెత్తింది డొంక తిరుగుడుగా

'మీరు మానాన్న చేత గ్రామఫోను కొనిపించుకొన్నారుకదా!' అని ప్రశ్నించిందామె!

'ఇప్పుడు నే కాదన్నానా?-' అతడు ప్రశ్నించాడు!

'అదికాదు మీరడగటం తడవుగా మానాన్న మీకు కొనియిచ్చాడు-ఏమంటారు?'

'మరమ్మత్తు చేయించి యిచ్చిన ఫోనేనా?' వ్యంగ్యంగా నవ్వాడు ధర్మారాయుడు

'చాల్లెండి-అందువల్ల మీకుగూడా-

'కాని యేమిటో-'

'మానాన్న మీకోర్కె తీర్చినప్పుడు-మీరుగూడా నాకోర్కె-'

'ఏమంటావ్?'

'తీర్చాలి'

'వీలుంటే యిష్టంఉంటే-తీరుస్తాను-ఏమిటో చెప్పు-యేంకావాలి?'

'తప్పక తీరుస్తారుగదూ?'-అంటూ అమాయకంగా చూసింది లలిత

'ఆ' అన్నాడతను!

'మామలు అల్లుళ్ళ కోరికలు-అల్లుళ్ళు మామకూతుళ్ళ కోరికలూ తీర్చటం భావ్యం మానాన్న మీకోర్కె తీర్చినప్పుడు-మీరు నాకోర్కె తీర్చాలి!'

'అలాగే-అసలువిషయం యేమిటో చెప్పు'-అన్నాడతను

'ఏంలేదు నాకో చీరకొనిపెట్టండి మీరు కొనిపెట్టారని మురిసిపోతూ కట్టుకొంటాను ఎంతో ఆనందిస్తాను-' అంది లలిత-

ధర్మారాయుగు దూరాలోచన చేశాడు-కాని మాట్లాడక ఊరుకొన్నాడు!

'ఏమండీ మాట్లాడరు మానాన్న మీకోర్కె తీర్చినప్పుడు-మీరు నాకోర్కె తీర్చరూ?-' అంది తిరిగి లలిత ధర్మారాయుడు-లలిత తన్ను పరిహారం కోరుతున్నట్లుగా అర్థం చేసుకొన్నాడు-ఆమెతండ్రి తనకు కొనిపెట్టినందుకుగాను-తానామెకు కొనిపెట్టాలిట-కొనిపెట్టడంసంగతి అటుంచి ఆమెను యేడ్పించాలని-ధర్మారాయుడు నిశ్చయించుకొన్నాడు ఆమె-'మీకు మానాన్న కొనిపెట్టారు కనుక మీరు నాకు కొనిపెట్టాలి' అని అననట్లయితే ఆవిధంగా నిశ్చయించుకొనేవాడు కాదు.

-చీరగూడా కొనిపెడతానని చెప్పి ఉండేవాడు!

'ఏలాటి చీర కావాలో కోర్కె-' అన్నాడు తను అదోవిధంగా మొఖంపెట్టి.

కోర్కెలు తీర్చేదేవుడు ముందున్నప్పుడు, భక్తుడు కోరుకొనటానికి యేవిధంగా తికమకలు పడతాడో, అదేవిధంగా పడింది - లలిత అయితే నిశ్చయం వెంటనే తేల్చి చెప్పాల్సిందేగా! అందువల్ల కొద్దికాలంలోనే-మనస్సును ఒకవైపునకు మళ్ళించుకొని 'ఈ రోజుల్లో బనారస్ చీరలు బాగుండవ్ బెంగుళూరుచీరలు బాగానే ఉంటాయ్ వాటిలో మంచిరకం నిర్ణయించి మీరే కొనియ్యాలి అన్నది లలిత

'బాగుంది ఏవో సాదా చీరలనుకొన్నా బెనారస్ చీరలు బాగుండవ్ కదా - బెంగుళూరు చీరలు బీదచీరలు మనబోటివాళ్ళకు బాగుండవ్ మధుర చీరల ధర మండిపోతున్నది - అందువల్ల యే చీరకొనవలసిన అవసరం లేదు'-అన్నాడు ధర్మారాయుడు!

లలితకు కోపంకల్గింది అయితే అవసరం తనదిగదా అందువల్ల 'మీరు సంతోషంతో యేచీర కొన్నా అభ్యంతరం లేదు మీ యిష్టంవచ్చినది కొనివ్వండి-' అందామె

'నాకే చీరవిషయం వదలినపక్షంలో-చెప్పమన్నావా?'-మధ్యలో ఆగాడతను!

'చెప్పండి'-అన్నది లలిత ఆదుర్దాతో

'ఏ చీరా కొనియిచ్చేదిలేదు!'-అంటూ నవ్వాడు ధర్మారాయుడు!

'ఇంతసేపూ చెప్పిన కబుర్లు బూడిదలో పోసినపన్నీరువిధంగా అయిపోయాయి. మీకు మానాన్న గ్రామఫోను కొనియిచ్చినప్పుడు - నాకు మీరు కొత్త చీరమాత్రమెందుకు కొనియివ్వరు?' - అని ప్రశ్నించింది లలిత క్రోధంతో!

'ఎందుకు కొనియివ్వాలి?' - అని అన్నాడతను వ్యంగ్యంగా!

లలితలో పూర్తిగా కోపం నిండిపోయింది తన తండ్రిచేత భర్త గ్రామఫోను కొనిపించుకొన్నప్పుడు - తన కాయన

కొత్తచీర కొనియివ్వాలి ఈ చీర కావాలని తాను నిర్బంధించి అడగలేదు ఏదో యిష్ట మొచ్చిన చీరకొనియివ్వమనిగా తాను కోరు కొన్నది ఈమాత్రానికే అతడీవిధంగా అనేశాడు!

'అయితే అంతేనంటారా?' - అన్న దామె!

తాను గ్రామఫోను కొనదలచుకొన్నానని చెప్పినప్పుడు - కొంటే కొనుక్కోండి! అనియేమో ఆమె అన్నది అది సమయానికి గుర్తుకొచ్చింది ధర్మారాయుడికి ' 'అంతే కాక మరేమనకొన్నావ్ అంతగా చీర కావలెనంటే - మీ నాన్న చేత కొనిపించుకో-' అన్నాడతను!

'మీరు గ్రామఫోను కొనుక్కొనలేక మా నాన్న చేత కొనిపించుకొన్నారేమిటి?' లలిత అంది

'అది వేరు అల్లుడు మామచేత కొనిపించుకొనటంలో అందం ఉంది

'భార్య భర్తచేత కొనిపించుకొనటంలో మరింత అందమున్నది'-అందామె!

'అంత గొడవెందుకూ నేను నీకు కొని పెట్టేది లేదు - అని తేల్చిచెప్పేశాడు ధర్మారాయుడు!

లలిత కళ్ళనిండా నీరునించింది 'అంతే నంటారా?' అన్నదామె!

'ఊఁ ఏంచేస్తావేమిటి?'- అన్నాడతను నవ్వుతూ!

'సరే అయితే మీ చేత చీరకొని కట్టుకొనకపోతే చూడండి'- అంది లలిత - క్రోధం మొఖంలో కనిపిస్తూంటే-

'ఓహ్ అయితే చూడు- నీ పేరుతోనే చీరకొంటే' - అన్నాడతను!

'చూద్దాంగా'-అన్నది యేలాగో - కాని పూర్తి దుఃఖంకల్గింది లలితకు - 'ఏమండీ'- అని బావురుమంటూ - అతడు జవాబివ్వకుండానే - మరోమంచం వాల్చుకొని - పక్కయినా వేసుకొనకుండా పరుండిపోయింది

'మరో మంగమ్మవ్ తయారయ్యావ్. శపథం తీర్చుకొనటానికి'- అంటూ తన పక్కమీదకు పోయి పరున్నాడు ధర్మారాయుడు!

ఆడది - ఆడదే! పాపం - లలిత యేంచేస్తుంది? ముఖంమాత్రం కందగడ్డలా చేసుకొని మంచంమీద పరుండి బావురుమని యేడ్వసాగింది! ధర్మారాయుడుమాత్రం - అది చూసి నవ్వుకొన్నాడు!

*   *   *   *

రోజులు గడుస్తున్నాయ్ ధర్మారాయుడు మాత్రం చీర కొనలేదు కొత్తచీర కొనలేదనే కోపం, రుసరుసలు ముఖంలోనూ, మాటల్లోనూ, లలితలో కన్పించుతూనేవున్నాయ్ అయితే యేలాగయినా భర్తచేత కొత్తచీర కొనిపించాలనే అభిప్రాయంమాత్రం ఆమెలో దృఢంగా నాటుకొని ఉండిపోయింది

ధర్మారాయుడి చెల్లెలు సత్యవతి పెళ్లి జరగబోతూంది ఇంటికి తండ్రితర్వాత కార్యభారం నెత్తిన ఉన్నవాడు ధర్మారాయుడే! అందువల్ల పెండ్లియిరవై రోజులున్నదనగానే సెలవుపెట్టి - లలితతో బయలుదేరాడు ధర్మారాయుడు!

బయలుదేరేముందు యింకోమారు లలిత తనకోర్కెను తెలియపర్చింది - 'ఏమండీ- చీర కొనిపెట్టరూ?' - ప్రాధేయపూర్వకంగా అడిగింది ఆమె-

'ఆ మాయదారిచీరకోసం - ఆలా అఘోరించకపోతేం?' అన్నాడతను-తాను గ్రామఫోను కొనదలచుకొన్నప్పుడు ఆమె అన్న 'ఆ మాయదారి గ్రామఫోను యెందుకూ?' అన్న సంగతి జ్ఞప్తికి తెచ్చుకొంటూ!

లలిత-దెప్పిపొడుపు గ్రహించుకొంది అయితే మాటకు మాట తిరిగి చెప్పలేక తల వంచుకొని కన్నీళ్లు కార్చింది ధర్మారాయుడు నవ్వుకొన్నాడు!

*   *   *   *

స్త్రీ పట్టుదలలో- తనశక్తిని ప్రదర్శించుకొంటుంది - విజయం సాధించితీరుతుంది- స్త్రీ శక్తిస్వరూపం అని ఋజువుపరుచుకొంటుంది లలిత సందర్భంలో గూడా అంతే - ఆమెకున్న పట్టుదల ఒక్కటే— భర్తచేత చీర కొనిపించుకొనటం - పెండ్లి మరి పదిరోజుల్లోననగా, రకరకాల చీరల వర్తకులు యెన్నికకోసం యింటికి వచ్చాయ్ నచ్చినవి ఉంచుతున్నారు, నచ్చనివి త్రిప్పిపంపుతున్నారు

ప్రతీచీరా ప్రత్యేకదృష్టితో పరిశీలిస్తున్నారు ఎవరికి నచ్చిన అభిప్రాయాలు వాళ్లు వెడలగక్కుతున్నారు

పాపం యిల్లంతా కలకలలాడుతున్నప్పటికి - లలిత హృదయంలో మాత్రం దుమారం రేగసాగింది

'నే నీ చీర కొనిపించుకొంటా' - అని యెవరికివారంటూంటే లలితకు దుఃఖం ఉబుకుకు వచ్చింది అయినా - దృఢమైన పట్టుదల - ఆమెను తిరిగి రెచ్చకొట్టింది తిరిగి ధర్మారాయుడి దగ్గరకువచ్చి 'ఏమండీ చీరకొనిపెట్టరూ అంతా నిండుయింట్లో కొనుక్కొంటున్నారండీ' అని అంది

'బాగుంది - అయితే నువ్వు గూడా మీ నాన్నచేత కొనిపించుకోలేక పోయావ్ ఎవళ్ళనాన్నలు వాళ్ళకు కొనిపెడుతున్నారు'- అన్నాడతను!

లలిత కళ్ళనీళ్ళు తిరిగాయి! 'అంతే నంటారా?' అంటూ బావురుమంది ఒకసారి లలిత ఆవిధంగా యేడుస్తూంటే - ధర్మారాయుడు నవ్వుకొన్నాడు జింహాకొకరుచి పుర్రెకొకబుద్ధి అనే సామెత ధర్మారాయుడికి తప్పక వర్తిస్తుంది కాకపోతే - కొని పెట్టే సంగతి అటుంచి- దెప్పుల్తో స్త్రీని - అర్ధభాగాన్ని-కన్నీరు కార్పిస్తాడా?

తర్వాత జరిగినగ్రంథం యేమోగాని - ధర్మారాయుడి తల్లి రెండుమూడు ఖరీదుగల బెంగుళూరుచీరలు తెచ్చి - వాటిలో మంచిది యెన్నమంది ధర్మారాయుడు దూరయోచన చేయకుండా అందులో మంచిదాన్ని యెన్నాడు.

నీకూ - అగే నచ్చిందీ - నీ భార్యా - చెల్లమ్మా అదే బాగున్నదన్నారు ఇది నీవాటా - నువ్వు కొని యివ్వాలి తెల్సిందా?'- అందితల్లి

'ఎవరికి-?-' - ఆశ్చర్యంతో ప్రశ్నించాడు ధర్మారాయుడు

'ఎవరికేమిటి? చెల్లమ్మకు?'

'సరే'- అన్నాడు ధర్మారాయుడు అంతకంటె యేం చెప్పగలుగుతాడుమరి? తోబుట్టువుకు వివాహసమయంలో ఒకచీర కొనిఇమ్మని నోరారా తల్లి చెప్పినప్పుడు - నెలకు నూటయేభై రూపాయల చిల్లర సంపాదించుకొంటున్న తను - ఒక చీర కొని యివ్వటం అంత గొప్ప విషయం కాదు!

ధర్మారాయుడు చీర కొనియిచ్చాడు!- వివాహం వైభవంగా జరిగింది ఎవరికోసమయితే ధర్మారాయుడు చీర కొన్నాడో- వారికి మాత్రం చీర ఉపకరించలేదు

రాత్రి, పెండ్లి అయిపోయినతర్వాత - కలకల నవ్వుతూ కొత్తచీర కట్టుకొని యేకాంతంగా భర్తను కలసుకొంది లలిత!

'చీర యెక్కడిది?'- అని ఆశ్చర్యంతో ప్రశ్నించాడు ధర్మారాయుడు!

'మీరే కొన్నారుగా!'- అంది లలిత—

'నేను కొన్నానా?-ఎవరు చెప్పారు?'- అన్నాడతను!

'మీ అమ్మ చెప్పింది'- ఆమె జవాబిచ్చింది

'ఇది నీకోసం కొనలేదే'

'నాకోసం కొనకపోయినా - కొనిపించినది నాకోసమే'- అంటూ నవ్వింది లలిత!

'అమ్మదొంగా-మంగమ్మ శపథం తీర్చుకొన్నావే!'- అంటూ జరిగిన విషయం మర్చినవాడివిధంగా - లలితను దగ్గరకు తీసుకొన్నాడు ధర్మారాయుడు!



**కథానిక:**

# డబ్బు-డబ్బు-డబ్బు

శ్రీ వి. వి. సూర్యనారాయణ

ఫాక్టరీ కూసి అరగంటయింది కూలీలూ, గుమాస్తాలూ యిళ్లకు వెళ్ళిపోయారు ఆరోజు లెక్కల్ని సరి చూసుకోడంలో ఆలస్యమయిన వీరాస్వామి కూడా కాగితాలన్నీ జాగ్రత్త చేసుకుని యింటికి వెళ్లడానికి లేచాడు ఫాక్టరీనుండి వీరాస్వామి యింటికి రమారమి రెండు మైళ్లదూరం వుంది

వీరాస్వామి ఆరు సంవత్సరాలనుండి ఆ ఫాక్టరీలో గుమాస్తాగా పనిచేస్తున్నాడు అరవై రూపాయల జీతంమీద ఆ జీతంతోనే భార్యనూ, యిద్దరు పిల్లల్నీ పోషించాలి పైగా రెండో పిల్ల పుట్టినదగ్గరనుండీ దాని రోగాలకీ, మందులకూ ఎంత డబ్బైనా చాలడం లేదు అయినా సంసారాన్ని చాలా గుట్టుగా యీదుకొస్తున్నాడు వీరాస్వామి

వీరాస్వామి ఫాక్టరీ ఆవరణ దాటి కొంత దూరం వచ్చేసరికి ఆకాశం వెల్లవెల్లగా నల్లబడుతూంది ఉండి ఉండి నీటిమీద నుండి వచ్చే గాలి శరీరంమీంచి చల్లగా జారి మనసుకు ఆహ్లాదం కలుగజేస్తూంది వీరాస్వామి నడకలో కొంచెం వేగం హెచ్చించేడు దూరాన ప్యాసింజరు స్టేషను వదలి వెళ్లిపోతూంది అప్పుడే తొమ్మిది గంటలయిందన్నమాట! రైలు కట్ట యింకా అక్కడికి అరమైలు దూరం వుంది అక్కడినుండి యింటికి మైలు నల్ల మబ్బులు అంతకంతకి ఎక్కువౌతున్నాయి వీరాస్వామి మరింత వేగం హెచ్చించాడు రైలుకట్టమీదకు వచ్చి ఓసారి స్టేషనువైపు చూశాడు స్టేషనులో మనుషులున్న అలికిడి యేమీ లేదు అంతా వెళ్లిపోయివుంటారనుకున్నాడు స్టేషన్‌నుండి ఊళ్లోకి పోయే రోడ్డుమీద కూడా జనసంచారమేమీ లేదు మెలికలు తిరిగిన రోడ్డు మబ్బుల నీడను నల్ల త్రాచులా కనిపిస్తూంది

ఆకాశంలో నల్లమబ్బులు చాలా దట్టంగా అల్లుకున్నాయి గాఢాంధకారంలో అప్పుడప్పుడు మెరిసే మెరుపులవల్ల మాత్రం దారి కనబడుతూంది వర్షం ఉప్పెనగా వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి వీరాస్వామి చేతిలో గొడుగు కూడా లేదు అతను పరుగెట్టడం మొదలుపెట్టేడు వీరాస్వామి పరుగుకి వాలుగాలి కూడా కొంత సహాయం చేస్తూంది ఇంకొక అరమైలు శ్రమ తీసుకుంటే యింటికి చేరుకోవచ్చు

చినుకులు ప్రారంభమయాయి పగలల్లా కాలిన నేలమీద 'టప్, టప్' మని చినుకులు పడుతూంటే భూమిలోంచి ఓ విధమైన వింత సౌరభం వస్తూంది పరుగెడుతూన్న వీరాస్వామి మరింత వేగం హెచ్చించాడు కొంత దూరం ముందుకి పోయి 'అబ్బా!' అని ఛట్టున ఆగిపోయాడు ఎదురుదెబ్బ తగిలింది వీరాస్వామి వంగి కాలు తడుముకున్నాడు బొటనవేలు బద్దలయి రక్తం కారుతూంది 'ఎంత గట్టిగా తగిలింది!' అనుకున్నాడు

వీరాస్వామి మళ్లా పరుగెట్టడం మొదలుపెట్టేడు పది గజాలు పరుగెత్తేసరికి మళ్లా కాలికేదో తగిలి కొంత దూరం జరజర ముందుకి జరిగి ఆగిపోయింది ఈసారి తగిలిందేదో గట్టిగా లేదు - మెత్తగా వుంది వేగంలో వీరాస్వామి రెండడుగులు ముందుకి వేసి ఆగిపోయాడు ఆకాశం మెరిసింది ఆ మెరుపు వెలుగులో వీరాస్వామి రక్తంతో తడిసిన చెయ్యి చూసుకున్నాడు ఆ వెలుగులోనే అతనికి తన కాలికి తగిలిన వస్తువుకూడా అస్పష్టంగా కనిపించింది నల్లగా, మిలమిలలాడుతూ అదేమిటో అతనికి సరీగా తెలియలేదు పామేమో ననుకున్నాడు కాని పాములా కనబడలేదే! నిజంగా పామే అయితే యింకా అక్కడుంటుందా అని అతని అనుమానం

ఆకాశం మళ్లా మెరిసింది ఈసారి జాగ్రత్తగా గమనించేడు వీరాస్వామి పర్సు! అరచేతి మందాన్ని ఉన్న మనీపర్సు మిలమిలా మెరిసింది, మెరుపు కాంతిలో వీరాస్వామికి కళ్లు మిరుమిట్లు గొలిపాయి! సంభ్రమంతో పర్సుతీసి నాలుగుప్రక్కలా ఓసారి కలయజూశాడు దూరాన నక్కలు అరుస్తూన్న ధ్వనితప్ప మరేమీ అలికిడి లేదు వీరాస్వామి పర్సులోఉన్న నోట్లన్నీ తీసి కోటు లోపలిజేబులో దాచేడు కాళీపర్సు దూరంగా పొలాల్లోకి విసిరేశాడు అసలు వీరాస్వామి ప్రతి చిన్నవిషయంలోనూ జాగ్రత్తపడతాడు

చినుకులు అంతకంతకు ఎక్కువౌతున్నాయి ఈసారి వీరాస్వామి పందెపు గుర్రంలా పరుగెత్తినా అతనికి ఆయాసమనిపించలేదు అతనింటికి చేరుకునేసరికి వర్షం బాగా పెద్దదయింది తొడుక్కున్న కోటు కొద్దిగా తడిసినా లోపలిజేబులో ఉన్న డబ్బు తడవకుండా జాగ్రత్తపడగలిగేడు ఇంట్లోకి వెళ్తూనే వీరాస్వామి సరాసరి తన గదిలోకి వెళ్లిపోయాడు డబ్బంతా కాగితంలో చుట్టబెట్టి జాగ్రత్తగా డ్రాయర్లో దాచి నడవలోకి వచ్చాడు

'అయ్యో, తడిసిపోయినట్లుంది, ఆకోటు విప్పెయ్యరాదూ?' అంది అతనిభార్య ఎదురుగావచ్చి

వీరాస్వామి కోటు తీసి భార్యచేతికిస్తూ, 'అవును దండెంమీద వెయ్యి ఆరుతుంది' అన్నాడు

కోటు అందుకుంటూన్న శాంతమ్మ యథాలాపంగా అతని కాలువైపు చూసింది. 'అంత దెబ్బ తగుల్చుకున్నారేమండీ? ఎంత రక్తం కారుతూందో!' అంది

వీరాస్వామికి యీ మాటలు సరిగా వినపడలేదు అతను ఏదో ఆలోచిస్తున్నాడు గాలిలో మేడలు కడుతున్నాడల్లే ఉంది. శాంతమ్మ మళ్లా అదే ప్రశ్నించింది

'చీకట్లో కాలికి రాయి తగులుకుంది'

శాంతమ్మ కోటు దండెంమీద వేసి, వేసలైన్ తీసుకొచ్చి, భర్తకాలుకి రాసి కట్టుకట్టింది 'ఏంపాడు రోజమ్మా, యివాళ ఎంత దెబ్బ తగుల్చుకున్నారో! కొంత జాగ్రత్తగా నడవకూడదుటండీ! ఇంక భోజనానికి లేవండి చాలా రాత్రయింది' అని వంటింటిలోకి వెళ్లిపోయింది, భర్తకు వడ్డించడానికి వీరాస్వామి చాలా జాగ్రత్తగానే నడుస్తాడు అయినా దెబ్బ తగిలింది!

భోజనానంతరం వీరాస్వామి మంచం

ఎక్కిన దగ్గరనుండి భవిష్యత్తునుగురించి కలలు కనడం మొదలు పెట్టేడు అతనికి నిద్రపట్టడంలేదు అసలతను నిద్రపోడానికి ప్రయత్నం చెయ్యలేదేమో! గదిమధ్య వ్రేలాడతీసిన మసిబారిన దీపం మసకమసగ్గా వెలుగుతూంది భార్యా, యిద్దరుపిల్లలూ నిశ్చింతగా నిద్రపోతున్నారు క్రింద పరచిన చాపమీద, దీపపు క్రీనీడక్రింద కిర్రుమంచంమీంచి వీరాస్వామి చప్పుడు కాకుండా లేచి డ్రాయరుదగ్గర కెళ్లేడు డ్రాయర్లో దాచిన డబ్బు పైకితీశాడు సంభ్రమంలోనైనా సరీగానే లెక్కపెట్టేడు, వీరాస్వామి సరీగా రెండువందల నోట్లున్నాయి! అన్నీ వందరూపాయల నోట్లే! అతనిలో ఊహాలు మళ్లీ ఓసారి కట్టలు తెంపుకుని ప్రవహించాయి. డబ్బంతా యథాప్రకారంగా కాగితంలో మడిచి, డ్రాయర్లో కాగితాల అడుగున దాచి, తన మంచం మీద కొచ్చి పడుక్కున్నాడు

ఈసారి వీరాస్వామి నిద్రను కావాలనే పారద్రోలాడు అత నిప్పుడు పెద్ద సమస్యలో పడ్డాడు. దొరికిన ధనాన్ని ఎట్లా వినియోగించుకోవాలా అని అతని ఆలోచన తన భార్యా భర్తలకు యిక్కడనుండీ వంటినిండా బట్టా, కడుపునిండా తిండీ దొరుకుతాయి తన మెదడు ఎంతదూరం వెళ్ళగలదో అంతవరకూ ఆలోచిస్తున్నాడు, వీరాస్వామి ముందు పాత బాకీలన్నీ తీర్చెయ్యాలి తనకు దొరికిన డబ్బుతో చక్కగా ఓ యిల్లుకట్టించుకోవచ్చు లేకపోతే పొలం కొనుక్కోవచ్చు. భారీ ఎత్తున ఏదైనా వ్యాపారం చెయ్యవచ్చు కాస్సేపాలోచించేసరికి యిదొట్టే మంచి పద్ధతిగా కనపడలేదు ఎందుచేతనంటే తనకింత డబ్బు ఒక్కసారిగా ఎలా వచ్చిందోనని లోకు లనుమానించక మానరు తనకు డబ్బు దొరికిందన్న విషయం నలుగురికీ తెలుస్తే ఎప్పటికైనా ప్రమాదమే! మరో విధంగా చెయ్యడానికి వీలుంటుందేమో నని ఆలోచించాడు, వీరాస్వామి డబ్బంతా బంగారంక్రింద మార్చి భార్యకూ పిల్లలకూ నగలు చేయించిపెడితే బాగుంటుంది అసలు తనకు యిరవైవేల రూపాయలు దొరికేయన్న సంగతి భార్యకు చెప్పాలా, వద్దా? అబ్బే, ఎంత సన్నిహితులైనా, ఆడవాళ్ళకుమాత్రం రహస్యాలు చెప్పకూడదు వాళ్లనోట్లో నువ్వుగింజ నానదు భార్యా పిల్లలూ సుఖపడడమే ముఖ్యంకాని, యీ విషయం భార్యకు చెప్పక పోయినంతలో నష్టం ఏమొచ్చింది?—అంతు తెగని ఆలోచనల్లో ఉండగానే అతనికి ఎప్పుడో నిద్రపట్టింది

* * * *

మర్నాడు వీరాస్వామి లేచేసరికి బారెడు ప్రొద్దెక్కింది అతను ముఖం కడుక్కొనేసరికి శాంతమ్మ కాఫీ తయారుచేసి తీసుకొచ్చి ఎదురుగా నిల్చుంది అతను గ్లాసు పుచ్చుకుని తాగడాని కుపక్రమించాడు

'ఏమండీ! అంత డబ్బెక్కడిదీ?' దీర్ఘంతీస్తూ అడిగింది, శాంతమ్మ, భర్త ముఖంలోకి ఆశ్చర్యంగా చూస్తూ

హటాత్తుగా విన్న యీ మాటకు వీరాస్వామి ఖంగారుపడ్డాడు తాగుతున్న కాఫీ తొణికి బట్టలమీద పడింది 'డబ్బేమిటి?' అన్నాడు తమాయించుకుని

'డ్రాయర్లో పెట్టారే'

'ఓ, అదా? మనదికాదులే' అన్నాడు పైకి 'అప్పుడే నీ కంట పడిందీ!' అనుకున్నాడు మనసులో.

'ఎవరిదండీ!'

'మనది కాదన్నానుగా?'

'అయితే, ఫాక్టరీ సంబంధమా?'

'చాల్లే అధికప్రసంగం చెయ్యక నోర్మూసుకుని అవతలకి నడు'

శాంతమ్మ అక్కడినుండి వెళ్లిపోయింది. ఈ ఆడవాళ్ల కళ్లుకప్పడం కష్టం అనుకున్నాడు, వీరాస్వామి అతిరహస్యం బట్టబయలైంది అప్పటికప్పుడు తాళం తెచ్చి, డ్రాయరుకు బిగించి, తాళంచెవి జేబులో వేసుకుని భోజనంచెయ్యకుండానే సరాసరి ఫ్యాక్టరీకి వెళ్లిపోయాడు

ఫ్యాక్టరీలో కూర్చున్న వీరాస్వామి ఆనందవాహినిలో తేలిపోతున్నాడు దొరికిన పెన్నిధిని సక్రమంగా వినియోగపరుచుకొనే ఉపాయాలకోసం అన్వేషించడంలో అతనికి ఊపిరాడ్డంలేదు ఆ వేళ అతనికి



సాయంత్రం వరకూ వున్న వుల్లాసం సాయంత్రం పేపరు చూసినతరువాత పూర్తిగా నశించిపోయింది దినపత్రికలో పడ్డ ప్రకటన వీరాస్వామిని చాలా కలవర పెట్టింది ఆత్రంగా ఆదే విషయాన్ని మళ్లీమళ్లీ చదివేడు

"పీపుల్స్‌బ్యాంక్ తాలూకు యిరవైవేల రూపాయలు నిన్న సాయంత్రం పోయినట్లు సదరుబ్యాంకు ఏజంటు రిపోర్టుచేస్తున్నారు పోయినవన్నీ వందరూపాలనోట్లు ఈ సందర్భంలో పోలీసుదర్యాప్తు జరుగుతూంది పోలీసువారిచేత పట్టుబడేలోగానే, ఆ సొమ్మును స్థానిక సబిన్‌స్పెక్టరుగారికి అందచేసినవారికి వెయ్యిరూపాయిలు బహుమానంయివ్వదల్చుకున్నట్లు పీపుల్స్ బ్యాంకు ఏజంటు తెలియజేస్తున్నారు

రంగారావు,

పోలీస్ సబిన్‌స్పెక్టరు"

ఆ ప్రకటనక్రింద పోయిన నోట్ల తాలూకు నెంబర్లన్నీ ఉన్నాయి

ఫ్యాక్టరీ ఇంకా వదిలేవేళ కాలేదనే సంగతి మరిచిపోయిన వీరాస్వామి పేపరు చంకను పెట్టుకుని యింటికి పరుగెత్తేడు ఇల్లుచేరి గదిలో అడుగుపెడుతూనే డ్రాయరు తెరచి నోట్లమీదఉన్న నెంబర్లు చూశాడు పత్రికలో ప్రకటింపబడ్డ నెంబర్లూ, యివీ—అన్నీ రీగా సరిపోయాయి! అతనికి మిన్నువిరిగి మీద పడ్డట్లయింది పోలీసుల దృష్టిలో కూడా పడింది కనుక యింకా నోట్లు మార్చుకోడం చాలాకష్టమైనపని మార్చడానికెక్కడికి తీసుకెళ్లినా తను పట్టుబడిపోతాడు ఈ పోలీసువాళ్లున్నారే, అవలిస్తే పేగులు లెక్కపెడతారు, అనుమానంమీద తన యిల్లు సోదాచేసినా చెయ్యవచ్చు ఎలాగైనా, ఆ డబ్బు యింట్లో పెట్టుకుని ఉండడం అశ్రేయస్కరం కాదనుకున్నాడు, వీరాస్వామి

వీరాస్వామికి మతి చలిస్తూంది లేచి సరాసరి నరసయ్యనాయుడుదగ్గరకు బయల్దేరాడు నరసయ్యనాయుడు వీరాస్వామికి చాలాదూరపు బంధువు అవ్వూళ్లో ఒక మూలగా నరసయ్యకొక యిల్లుంది ప్రస్తుతం అది ఖాళీగా ఉంటూంది తీరుబాటుగా ఉండేటప్పుడు వీరాస్వామీ, నరసయ్యా చదరంగం ఆడుకుంటూఉంటారు అందుచేత ఇద్దరికీ పరిచయం జాస్తి

నరసయ్యతో కాస్సేపు పిచ్చా పాటీ మాట్లాడి మాటలసందర్భంలో అడిగినట్లు అడిగేడు వీరాస్వామి

'ఏం, నరసయ్యా! నీయిల్లు ఖాళీగా ఉందనుకుంటానే'

'అవునయ్యా, ఊరికి ఓమూల అయిపోడంవల్ల ఎవరూ అద్దెకు దిగడంలేదు నీ ఎరికనెవరైనా ఉంటే చూద్దూ ఏదో కాడికి అద్దెకిచ్చేద్దాం ఖాళీగా ఉండడంవల్ల అధ్వాన్నంగా పోతూంది'

'ఎవరికో ఎందుకు? నాకే యిచ్చెయి' అన్నాడు, వీరాస్వామి మాటలో మాటకలిపి

'ఆఁ! నీకేం వచ్చిందీ? అయినా నువ్వెక్కడో ఉంటున్నావుగా?'

'అంటే కుటుంబం అంతటికీ కాదులే నాకే కావాలి ఇంటిదగ్గర పిల్లల అల్లరి ఎక్కువగా ఉంది ఏదైనా చదువుకుందుకీ వ్రాసుకుందుకీ ప్రశాంతంగాఉంటే యిల్లు ఎక్కడైనా దొరుకుతే తీసుకుందామని చాలా రోజుల్నుండి అనుకుంటున్నాను'

'ఇంకేం నీకు కావలిస్తే మరీ మంచిది తప్పకుండా దిగు ఏదో నీకు తోచిన అద్దె యివ్వవచ్చునులే'

వీరాస్వామి మారుమాట్లాడకుండా యింటి తాళం తీసుకున్నాడు ఆ రాత్రే యింట్లో ప్రవేశించాడు రెండు కుర్చీలూ, ఓ టేబిలూ, కొన్ని పుస్తకాలతోటి గది తలుపులన్నీ మూశాడు గదిలో ఒక మూల మోచెయ్యిలోతున గొయ్యి తీశాడు ఇరవై వేల రూపాయల కరెన్సీనోట్లూ ఒక కట్టె కరపెట్టెలో పెట్టి, ఆ పెట్టెను జాగ్రత్తగా గోతిలో దాచి, ఎప్పటిలాగా గోతిని





పూడ్చేశాడు అప్పటికతని మనస్సు కొంత కుదుటపడింది తను డబ్బు ఎక్కడ దాచిందీ పోలీసులింక ఛస్తే కనుక్కోలేరన్నమాట!

ప్రతి విషయంలోనూ వీరాస్వామి తీసుకునే జాగ్రత్త అటువంటిది!

వీరాస్వామి యింటికొచ్చినదగ్గరనుండీ మళ్లా అతనికి ఆందోళన ఎక్కువైంది తను డబ్బు దాస్తూన్నప్పుడు ఎవరైనా చూశారేమో నని అనుమానం కలిగింది కాని తను లోపల ఉన్నంతసేపూ తలుపులన్నీ బిగించి మరీ డబ్బు దాచినసంగతి జ్ఞాపకంవచ్చి కుదుటపడ్డాడు ఇప్పుడు తను ఆ నోట్లు మార్చుకునే ఉపాయంకోసం అన్వేషించడం మొదలుపెట్టేడు అప్పటికే యీ విషయం ప్రజలందర్లోకీ ప్రాకిపోయింది కనుక ఎక్కడ మార్చడానికి ప్రయత్నించినా సులువుగా పట్టుబడిపోతాడు ఫ్యాక్టరీలో ఉద్యోగస్తులందరికీ జీతాలు బట్వాడాచేసేది తనే జీతాలిచ్చే రోజున యీ నోట్లు మార్చేసి చిల్లర నోట్లు తెచ్చుకోవచ్చు బాగా ఆలోచించిన మీదట వీరాస్వామికి యీ పద్ధతికూడా సమంజసంగా ఉన్నట్లు తోచలేదు ఇది అన్నిటికంటె అపాయకరమైన పద్ధతేమో ననుకున్నాడు ఈ ఆలోచనలతో బుర్ర బాగా వేడెక్కిన తరువాత ఒక నిర్ణయాని కొచ్చేడు ప్రజల్లోనూ, పోలీసువారిలోనూ చైతన్యం సద్దుమణిగి మళ్ళీ విషయాన్ని పూర్తిగా మరిచిపోయేవరకూ డబ్బు మార్చడానికి ఎటువంటి ప్రయత్నమూ చెయ్యకూడదని నిశ్చయించుకున్నాడు తరువాతనైనా అవకాశాన్నిబట్టి ఒకొక్కక్కనోటే సందర్భోచితంగా అతి మెలకువగా మార్చుకోవాలి



'భోజనానికి లేవండీ! మధ్యాహ్నంకూడా తిండి తినలేదు' ఈ మాటలతో అతని ఆలోచనల కంతరాయం కలిగింది

వీరాస్వామి తలఎత్తి చూశాడు ఎదురుగా శాంతమ్మ నించుంది

'పద వస్తున్నా,' అన్నాడు వీరాస్వామి

భోజనందగ్గర భర్త పరధ్యానం కనిపెట్టింది, శాంతమ్మ కూరకలుపుకోగానే 'మజ్జిగ వెయ్యి' అన్నాడు వీరాస్వామి ఏదో ఆలోచిస్తూ

'అదేం భోజనమండీ! చారు కలుపుకోరూ?'

'పొయ్యి' అన్నాడు

'ఇవాళ యింత పరధ్యానంగా భోంచేస్తున్నా రేమిటి?'

'ఏం లేదు చారు పొయ్యి'

చారు పోస్తూ శాంతమ్మ అడిగింది 'డ్రాయర్లో డబ్బు ఏమైందండీ?'

'ఇచ్చేశాను మనది కాదని చెప్పలే?'

'ఇదాకా కుర్చీలూ, బల్లలూ తీసి కెళ్తున్నా రెక్కడికి?'

'నీ కెందుకదంతా!'

'చెప్పకూడదా యేమిటి?'

'నోర్ముయ్!'

'అయ్యో నేనేమన్నానండీ!'

'ఛీ నన్ను విసిగించకు' వీరాస్వామి తింటూన్న కంచం ఎత్తి భార్యమీదకు విసిరికొట్టి లేచిపోయాడు కొదిలో తప్పిపోయింది కాని శాంతమ్మకు దెబ్బ తగలవలసిందే

'ఇక నే నేమీ మాట్లాడను రండీ, అన్నం తినండీ!' అని శాంతమ్మ ప్రతిమాలింది కాని, అతను వినిపించుకోకుండా వెళ్లి గదిలో పడుక్కున్నాడు తను ఎంత గుట్టుగా ఉందామనుకున్నా డబ్బువిషయం రెండో మనిషికి తెలిసినందుకతని మనస్సు కలచివైచినట్లయింది

* * *

డబ్బు దొరికినదగ్గరనుండీ వీరాస్వామి రోజురోజుకీ మారిపోతున్నాడు ఏదో అనిర్వచనీయమైన బెంగ అతన్ని కృంగదీస్తూంది చీటికీ మాటికీ చికాకుపడి భార్యను కొట్టడం ప్రారంభంచేడు ఆ అమాయకురాలు భర్తలో రోజురోజుకూ కలిగే పరిణామాన్ని అర్థం చేసుకోలేక పోతూంది

ఒకనాడురాత్రి వీరాస్వామి యింటికి చాలా ఆలస్యంగా వచ్చి తలుపు కొట్టాడు నిద్దర్లో ఉన్న శాంతమ్మకు వినిపించక పోవడంవల్ల వెంటనే తలుపు తియ్యలేదు అతను తలుపు గట్టిగా బాదడం మొదలు పెట్టేసరికి శాంతమ్మ తెలివి తెచ్చుకుని, కళ్లు నులుపుకుంటూ వచ్చి తలుపుతీసింది

'రాస్కెల్! ఇంతసేపా తలుపు తియ్యడం?' శాంతమ్మ చెంప ఛెళ్ మంది శాంతమ్మకు నిద్రమత్తు బాగా వదిలింది

వీరస్వామి తూలిపోతున్నాడు అతని నోటినుండి ముక్కుపుటాల్ని బ్రద్దలుచేసేటంత దుర్గంధం వెలువడుతూంది భర్త త్రాగేడని తెలుసుకుంది, శాంతమ్మ తను కాపరాని కొచ్చేసరికి ఎంతో సద్గుణవంతుడుగా ఉండే భర్త యీనాడు యిన్ని విధాలుగా మారిపోవడానికి గల కారణం ఊహించుకోలేక శాంతమ్మ చాలాసేపు తికమక లాడింది తూలిపోతూన్న భర్తకు చెయ్యి ఆసరాయిచ్చి మెల్లగా తీసికెళ్లి మంచంమీద పడుకో పెట్టింది

వీరాస్వామి ఉదయం లేచేసరికి మళ్లు

(45-వ పేజీ చూడండి)

సీరియల్:

పెద్దకథ...

# వారసులెవరు?

శ్రీ ఘట్టి కృష్ణమూర్తి

[ఈకథ, ఇందలివ్యక్తులు, జరిగినప్రదేశం -అన్నీ కల్పితాలు ]

ఆ వూళ్లో, చెరువుగట్టున, మఱ్ఱిచెట్టు కింద కూచుని మాట్లాడుకునే గ్రామస్థులందరికీ ముఖ్యంగా మహదేవయ్యగారి విషయమే చర్చనీయాంశమైంది

కాదుమరి? - ఆవూళ్లోకల్లా ఆయన పెద్ద మోతుబరు, పంచాయితీబోర్డు ప్రెసిడెంటు, జిల్లాబోర్డు మెంబరు - కూడాను

అప్పట్లో - అంటే 1947 ఆగస్టుకు పూర్వం - ఆయనకు 'రావుబహదూర్' బిరుదుకూడా వుండేది, కలెక్టర్ స్వయంగా సీటుయిస్తూ వుండేవాడు రానురాను ఇటీవల ఆయన్ను దేశభక్తి పైకొన్న కారణంగా పెద్దత్యాగం చెయ్యాలని గాంధీమహాత్ముడే స్వయంగావచ్చి ఉపదేశించినట్టు వోనాడు రాత్రి కలగన్నాడు తెల్లవారి లేచీ లేవడంతోనే తనబిరుదు తను పరిత్యజించినట్టు హుటాహుటి ప్రకటించుకున్నారు

ఆదినుంచీ, ఆయన సంపాదించుకున్న పలుకుబడి పీసమంతయినా తగ్గకపోగా యీ స్వతంత్రభారతంలో దినదినాభివృద్ధిచెందుతూ, ఆయనకు, ఆగ్రామస్థులకు కూడా శతవిధాల సహాయపడుతోంది

ఇప్పుడు ఆయన తల్చుకుంటే, ఒక యం ఎల్ ఏ ఏమిటి తెలివితక్కువ— ఒక మంత్రిగారి కంటేయెక్కువ నిరవాకమే చెయ్యగలడు

అదీకాక ఆవూరి ఆనువాయితీని బట్టి ఆయనకు సహజంగా సంక్రమించిన బిరుదం మరొకటుంది "షావుకారు"

అసలాయన తండ్రులనాటినుంచీ వారిది షావుకారు వంశమే

ఆ వూళ్ళో పాతిక ముప్ఫై యకరాలు పైబడ్డ ప్రతి ఆసామికీ అదొక పౌరుషనామధేయం, పైపెచ్చు ఆపేరు పెట్టుకున్న ప్రతి వ్యక్తీ తమ కది భగవద్దత్తమైన వరప్రసాదంగా భావిస్తూ వుండడంకూడా కద్దు

పంచాయితీ ఆఫీసు, కో - ఆపరేటివ్ బ్యాంకు మొదలైన నలుగురూ కూడుకునే ప్రదేశాల్లో వాళ్ళ డాబూదర్పం చూసినా వాళ్లు మాట్లాడే వైఖరి గ్రహించినా వీరు ఆవర్గానికి చెందినవారే నని ఇట్టే పసిగట్టెయవచ్చు

ఇలా కృతకంగా పేరులు ధరించినవారు ఊళ్ళో కొందరున్నా పుటకతోనే షావుకారు వంశీయులైనవారు పదిమందికి తక్కువే వాళ్లలో వొకడు మహదేవయ్యగారంటే

ఈ వర్గానికి చెందిన ఆజన్మషావుకార్లందరూ కలిసి వొక సంఘం వారిలోనే ఏటా వొకళ్ళవంతున ఆ సంఘానికి అధ్యక్షత వహిస్తూవుంటారు

ఈ సంఘం నిర్వర్తించే కార్యక్రమం ఏమిటంటే! తమ వంశగౌరవాన్ని యథాతథంగా కాపాడుకోవడం మొదటిది ఆ వూళ్లో పాతిక ముప్ఫై యకరాలు భూమి యెవరికి మించుతున్నదో వారి విన్నపాలు ఆలకించి, తగురీతిని సమావేశపరచి, పంచాయితీఆఫీసుముందర, నలుగురి సముఖంలో "షావుకారు" అనే పౌరుషనామధేయప్రదానం చెయ్యడం

ఇది సాధారణంగా కొత్తపంటలు చేతికి వచ్చేరోజుల్లో జరుగుతుంది ఆ సంబరంలో అతడు నలుగురికీ యింత మృష్టాన్నం తినిపిస్తాడు

ఆనాటినించీ ఆ సంఘంలో అతడు కూడా సభ్యుడు అవుతాడు, అప్పణ్ణించే ఆగ్రామంలో సాధారణపౌరునికి లేని కొన్ని విశిష్టమైన అధికారాలు, హక్కులు అతడికి కూడా సంక్రమిస్తయ్

మరో విశేషంకూడా యేమిటంటే యీ ఆజన్మషావుకార్లలోనే వొకొక్కరికి వెనుక కొందరు అనుయాయులుకూడా వుంటూంటారు వారికి ఆ షావుకారు పేరుతోనే వాళ్లముఠాగా వ్యవహరిస్తూ వుండడంకూడా కద్దు మచ్చుకి-వీరిలో ఒకాయన మునసబుగారు అనుకోండి! తదనుయాయుల్ని "మునసబుగారి ముఠా" అని పిలుస్తారన్నమాట! వాళ్ల తరవాత ద్వితీయస్థానాన్ని ఆక్రమించుకునేది వీళ్లే

ఈవర్గంవాళ్లకూ నాలుగైదెకరాలు ఉండీ, ఉండని సామాన్య ప్రజలకు, తూర్పు పడమరల కున్నంత భేదం వుంది దానికి తగినట్లుగానే ఆ వూరికి ఒకరు తూర్పుదిక్కునా, మరొకరు పడమటి దిక్కునా నివసిస్తూవుంటారు

ఈరెండుదిక్కులకూ నడుమ వున్న ఒక పెద్దచెరువు, సహజంగానే భౌగోళికంగా వారిని వేరుపరుస్తూవుంటుంది అయినా దానిమీద తూర్పువాళ్ల కెట్టి అధికారమూ లేదు చేపలు పాట పాడాలన్నా, పట్టించి పంచుకోవాలన్నా, ఇలాటి సర్వ హక్కులూ పడమటి వంశాలవారకే తరతరాలుగా సంక్రమిస్తూ వస్తున్నయ్

చెరువుకి ఒకవైపున మఱ్ఱిచెట్టుకింద, మేడల అంతస్తులకు సిమ్మెంటు చెయడాన్ని గురించి సమాలోచిస్తూవుంటే, మరొక వేపున గంగరావిచెట్టు కిందున్నవారు ఇళ్లు కట్టుకోడానికి తాటాకు కొనలేక, వందకు ఆరేడురూపాయలవరకూ పెంచిన షావుకార్ల స్వార్థాన్ని తల్చుకుని పళ్లు కొరుకుతూవుంటారు (అక్కడవున్న తాడిచెట్లలో నూటికి తొంభైవంతులు షావుకార్ల భూముల్లోనే వుండం మరో విచారకరమైన సంగతి!

వీళ్ల ధనబలానికి వాళ్లు భయపడతారు, వారి సంఖ్యాబలానికి వీరు జంకుతారు

మొత్తంమీద భూచంద్రమండలాలు పరస్పరాకర్షణలవలన ఒకదాని కొకటి ఢీకొనకుండా విశ్వాంతరాళంలో నిలిచివున్నట్టు ఆవూళ్లో తూర్పు పడమరలు కూడా కాలంతోపాటు మనగలుగుతున్నయ్!

పూరిగుడిసెల్లో పుట్టి, పెట్టిపుట్టిన షావుకార్ల మేడలవెనుక అస్తమిస్తూ వుంటాడు సూర్యుడు -

సాంఘికమైన కట్టుబాట్లుకూడా అక్కడ విచిత్రంగానే వుంటయ్ ఆ వూళ్ళోనే ఇచ్చి పుచ్చుకోవడాలంటూ సంభవిస్తే ఏ దిక్కు పిల్లని ఆ దిక్కునే ఇచ్చుకోవాలి లేదా అసలే మానుకుని పొరుగూరి సంబంధానికి పోవాలి ఒకవేళ పడమటి పిల్ల తూర్పు యువకుని ప్రేమిస్తే అది వాళ్ళ వంశానికే మాయని మచ్చ అన్నమాట -

ఇంక వ్యక్తిగతంగా మహదేవయ్యగార్ని గురించి చెప్పుకోవాలంటే మహాభారతమంతవుతుంది

ఆ సంగతి మనతోబాటు ఆయనా

గ్రహించారు అందుకనే ముందుతరాల వారు తరించడంకోసం - ఆదర్శంగా జీవితం నెరపడంకోసం, ఒక్క మాటలో చెప్పాలంటే, వొక సంగ్రహార్థం - స్వీయ వంశ చరిత్రినంతా తన వంశీయుడైన వొక కవిపుంగవుని చేత, అతగాడికి అయిదెకరాలు యీనాంగా యిచ్చి, సమగ్రసుందరంగా పద్యకావ్యం వొకటి వ్రాయించారు! అదే "మహాదేవ వంశావళి" అనే పేరుతో పాఠకలోకం యెదట ప్రత్యక్షమయేదే కాని, పెద్ద అవాంతరం వొచ్చిపడింది కదా!

లోకంలో కాస్త తలెత్తుకు తిరగ నేర్చిన వ్యక్తినిగుఱించి, చాటునో - మాటునో, మంచో, చెడో చెప్పకోక మానరు

అలాంటప్పుడు మహాదేవయ్యగారి వంటి మహోదాత్తచరితుణ్ణిగూర్చి ఆ గ్రామంలోనే ఆయన సమక్షంలోనే - జీవించే ప్రజలు ఆగుబ్బుగా చెప్పకుంటున్నారన్నా ఆశ్చర్యపడవలసిన అవసరంలేదు

పుస్తకాల కెక్కడానికి అనర్హములైన, మహాదేవయ్యగార్ని గుఱించిన - కొన్ని సంగతులు తూర్పుదిక్కున పూరిగుడిసెల్లోనించి గాలిలోకి ఎగిరిపోతూ వుంటయ్

"పాపం! ఆయన కింత ఐశ్వర్యంవున్నా నిరాడంబరంగా జీవితం నెరపేవాడేనట!

పొదుపుగా వాడుకోవడంలో ఆయనది అందెవేసిన చెయ్యి ఈమధ్య వొక నాయకుడు ఇక్కడకు వచ్చినపుడు మహాదేవయ్యగార్ని గురించిన సంస్తవోపన్యాసంలో యీ విషయాన్నిగురించి ప్రముఖంగా వాక్రుచ్చారు

ఈ కరువురోజుల్లో ఆయన్ను ఆదర్శంగా తీసుకుని అందరూ పొదుపు అలవాటు చేసుకోవాలని మహాఘనంగా ఉద్ఘాటించారు, మధ్య మరో చెణుకు కూడా విసిరారు

పొదుపుగా వాడుకోండని నెహ్రూ మొదలైన నాయకులు మాట్లాడుతుంటే మనం చెవులు నిక్కించుకుని రేడియోల దగ్గిర వింటాము కాని వారెలా జీవితం నెరపుతున్నారో తెలీదు కదా!

మహాదేవయ్యగారి వంటి మహాపురుషుడు ప్రత్యక్షదైవంగా మనకు ఆచరించి చూపుతున్నపుడు ఆయన్ను అనుకరించడమే ఉచితజ్ఞత, సమయజ్ఞతా అనిపించుకుంటుంది" అని

ఆయన జీవకారుణ్య దృష్టితో చేసే యెన్నదగిన ఘనకార్యాలు కొన్ని వున్నయ్—

పచ్చిబాలెంతకు పథ్యానికి పాతబియ్యం దొరక్క అఘోరిస్తున్న అభాగ్యులకు మూడు సంవత్సరాలనాడు పాతరపడిన బియ్యమైనా సప్లయి చేయగలడు ధరలు నిర్ణయించే విషయంలోను కొలపాత్రలు ఉపయోగించే విషయంలోను, సర్వ నిర్ణయాలు చేసే హక్కు ఆయనది ఆయన అర్ధాంగి మహాలక్ష్మమ్మగారిది మాత్రమే—

సాధారణంగా ప్రస్తుతంవున్న ధరకంటే మూడు రెట్లు యెక్కువ ఎలాగూ వుంటుంది దానికి వొక షరా లేకపోలేదు "సమయాన్ని బట్టి రేట్లు హెచ్చింపబడును"-

ఇటువంటి లోకసంగ్రహణకార్యాలు కుంటుబడిపోతయ్యనే, కోపట్టాన ధాన్యం చెయివొదలడు

బస్తా 35 రూపాయలైనా కార్తీకమాసం కరువురోజుల్లో ఆయనవద్ద పుష్కలంగా లభ్యమవుతున్నయ్యంటే అదంతా ఆయనకు లోకం యడలగల అవ్యాజప్రేమకు తార్కాణమే!

ఇలాటి, ఆయనగారి ఉచిత సహాయజ్ఞతను గుర్తించే కొబోలు ప్రాక్యూరుమెంటు వారు ఎన్నడూ ఆయన్ను నిర్బంధించరు, అసలు పెదవి కదిపి అడగరు కూడాను! ఇస్తే, ఇచ్చినంతే ప్రాప్తం మహాదేవా, అని ఊరుకుంటారు

జీవకారుణ్య దృక్పథంతో యేదో తోచినరీతిగా సప్లయి చెస్తూవుంటే కొనుక్కు తినలేక చాటుమాటున ఏమనుకుంటున్నా ఆయన ఖాతరు చెయ్యరు కుక్కలు మొరుగుతుంటే యేనుగులకేం లెక్క, జమా?

కావలసినంత పాడి-ఇంట్లో పెద్ద సిబ్బందికూడా యెవరూ లేరు మహాదేవయ్యగారికి ఒక కొడుకు, కూతురు మాత్రమే అందుకని పాలు పెరుగు వెన్న-మొదలైనవి సప్లయి చెయ్యడంలో, వూర్లో కల్లా వీరిదే అగ్రతాంబూలం

అసలు-ఆవూళ్లో రైతులందరూ పాలు, పెరుగు మొదలైనవి సప్లయి చేస్తారు సమీపంలో వున్న పట్టణానికి లారీల మీద రవానా జరుగుతూవుంటుంది అదెంత భారీ యెత్తున జరుగుతుందంటే, ఆవేళకు హాజరు కాకపోతే ఊర్లో వారికైనా ఉగ్గిగిన్నెడు పాలు దొరకడం దుర్లభం!-

అయినా మహాదేవయ్యగారి వద్దతే వేరు అందరితోపాటు అణాకీ బేడకీ అమ్ముతూవుంటే అంత షావుకారికీ తలకొట్టేసినట్టవుతుంది గానీ అందుకని ఎప్పుడూ వొక చెయ్యిపైనే వుంటాడు అంటే మరేం లేదు అన్నిచోట్లా అర్ధరూపాయి అమ్మే పాలు మహాదేవయ్యగారి గోష్ఠంలో పదణాలు పలుకుతుందన్నమాట! అలాగే పెరుక్కూడాను

మరో విశేషమేమిటంటే, వాళ్ల యింట్లో కొన్న వెన్నబరువులో పాదర



సంలా తూగుతుందంటే నమ్మండి! గోడ అవతలకు వెళ్లి ఎంతమంది యెన్ని సణుక్కుంటే మటుకు ఆయనకేం మచ్చా? పైగా చంద్రునికి వొకళంకం వుండడమే అందం అని సమాధానం చెప్పకుంటారు

పాడిపంటల విషయంలో అమ్మకం వగైరా అన్ని వ్యవహారాలూ చూచేందుకు, ఎనిమిది రూపాయలన్నరకు వో గుమాస్తా కూడా వున్నాడు ఈ కరువురోజుల్లో అతడికింత జీతం యివ్వడం ఘనమైన విషయమేనంటారు మహాదేవయ్యగారు పైగా పొదుపు అలవాటు చేసుకుంటే యెంతలోనయినా జీవితం వెళ్లబుచ్చుకోవడం సుఖమేనంటాడు—"

ఇలాటివే కొన్ని గాలికబుర్లు వినవస్తూ వుంటాయి తూర్పువేపునించి వాళ్ళంతా ఖరీదుపెట్టి కొనుక్కోలేని అలగాజనం కనక ఆమాట లనుకుంటారు! మహాదేవయ్యగారి మంచితనాన్ని, వదాన్యతను, కవులే కీర్తిస్తుంటే!—

## 2

ఇప్పుడు మఱ్ఱిచెట్టుకింద కూచుని మాట్లాడుకునేవారిలో తూర్పు పడమరలవారు

ఊరిసగం వున్నారు, విషయం రెండు దిక్కులవారికీ సంబంధించినదే కనక

ఇంతలోనే యెక్కణ్ణించో వడిసెల్లో రాయిలా వూడి పడ్డాడు వెంకయ్య

వెంకయ్య అంటే గడచిన మాఘమాసం లోనే షావుకారు పట్ట ప్రదానోత్సవం చేయించుకున్న వ్యక్తి అందువల్ల ఆయన పేరుకు ముందు "షావుకారు" పదంకూడా ఉంచాలి !-

చదువు సంధ్యలు సున్నా అయినా నోరు గలవాడు, కర్రపెత్తనంచేతనే యింత వరకూ కొట్టుకొస్తున్న గడసరి ప్రత్యేకించి మహాదేవయ్యగారి మురాలో ముఖ్యుడు, ఆయనకు కుడిభుజంలాటి వాడన్నా అతిశయోక్తి కాదు—

వెంకయ్య రాకతో అక్కడున్న వాళ్లలో. వో విధమైన కలకలం బయల్దేరింది అల్లంత దూరానే ఆయన్ను చూసి వీరాసామి సూరయ్య చెవులో వూదాడు "నల్లతేలొస్తోంది రోయ్" అని

ఆమాట విన్నట్టున్నాడు వెంటనే అందుకున్నాడు రామకిష్టమ్మ "ఏడిచార్లేరా యెదవల్లారా! ఊసుబోక మాటాడుకో వచ్చినోళ్లు ఎంతలో వుండాలో అంతలోనే వుండాలి మఱ్ఱిచెట్టుకింద కూచుని షావుకారులాగా మాట్టాడుతున్నావే!" అంటూ నడుముకీ మోకాళ్లకీ బిగించిన ఉత్తరయ్యం వొదులుచేస్తూ అటుపక్కకు తిరిగి నోట్లో చుట్టతీసి తుపుక్కన ఉమ్మేశాడు

రాంకిష్టమ్మ షావుకారు కాదుగానీ, మహాదేవయ్యగారి మురాలో వాడుమాత్రం అవును అతడికి అంతకుముందునించే వీరాసామి అంటే కడుపులో రగుల్తోంది, యీ అవకాశం చూసుకుని మరింత రెచ్చిపోతున్నాడు—"అర్ధణాకరీదు చెయ్యని ఎదవలు కూడా యెక్కిరించే వోళ్లే! ఎహే!" అని సకిలిస్తూ, పొగాకు పాయి తీసుకుంటూ పక్కనే నుంచున్న వెంకయ్య వంక చూశాడు

"అడ్డమైనోళ్లకీ అలుసిస్తే యేమౌతుంది మరి?" అన్నాడు వెంకయ్యను దెప్పిపొడుస్తున్నట్టుగా

ఈమాటకు వెనకటి చరిత్ర ఏవిఁటో వెంకయ్యకు అర్థంకాక ఇలా అన్నాడు చుట్టకొరికి వుమ్మేస్తూ "ఏంమావాఁ ఏవిఁటో లంక పొగాకంత సూటుగా విసిరేస్తున్నావ్ మాటలు!" అని చుట్ట ముట్టించి తనూ రాంకిష్టమ్మ పక్కగా వొచ్చి కూచున్నాడు

ఏదో చెవులో వూదాడు రాంకిష్టమ్మ "ఏడిశారు వెదవలు" అని గొణుక్కుంటూ అందరివంకా గుడ్లురిమి చూశాడు వెంకయ్య అక్కడితో అందరిలోనూ గుసగుసలు ప్రారంభమయినయ్

సూరయ్య ఉన్నవాడుండక సర్దిచెబుదామనే ధోరణిలోనే ఇల్లా అన్నాడు "ఏదో మా వీరాసావేఁ నోరుజారి అన్నాడనుకుందాం, రాంకిష్టమ్మగారు పెద్దోడుగందా, సర్దిచెప్పాల్సిందిపోయి, ఎక్కడెక్కడివీ తవ్వుకొచ్చి వాణ్ణి మరింత ఉసిగొలపడం యెందుకంట, జరిగిందేదో జరిగింది అదెవరూ కాదనలేరు వోచెంప లోకం కొడైకోస్తాంటే మనం వూరుకుంటేమటుకు దాగుతుందా? అంటే రాంకిష్టమ్మగారు వొట్టి కోపదారిమణిసి గానీ " అని

"ఏడిశావ్ నోరుముయ్యరా! అలగా జాతివెధవలంతా పోగై కారుకూతలు కుయ్యడానికి బుద్ధి ఉండక్కర్లా?" అన్నాడు వెంకయ్య, అగ్గిరాముడై మండిపోతూ

"ఎంకయ్య బాబోయ్! అంత సులకనేసి మాట్టాడితే కుర్రోళ్లూరుకోనేట్టు లేరు" అన్నాడు గోపయ్య ఆ చివర్నించి మెల్లిగా, అంతవరకూ ముడుచుక్కూచున్న కాలు జాపుకుంటూ

"అఁ ఈ యెదవలంతా ఊరుకోక ఉరెట్టుకుంటారు?" అన్నాడు షావుకారు రామనాథం, చుట్ట నోట్లో పెట్టి అగ్గిపెట్టె కోసం వెంకయ్య వేపు చెయిజాస్తూ

"మళ్లీ అట్టాగే అంటున్నారు, ఇది రగులుద్దిసుమా" అన్నాడు వీరయ్య, హెచ్చరించే ధోరణిలో

"ఈ వెధవ బెదిరింపులూ మీరూ అఘోరించారుగానీ, నోర్లు మూసుకుని ఇళ్లకేడవండి! అనవసరమైన విషయాల్లో వేలెట్టి చెప్పదెబ్బలు తినక" అన్నాడు షావుకారు నారాయణప్ప, చన్నీళ్లుపోసే ధోరణిలో. కాని అది ఆజ్యమై మరింత రగుల్కొంది దాంతో అక్కడున్నవాళ్లందరూ రెండు కక్షలుగా చీలిపోయినారు

ఏ వర్గంవారు వాళ్లని బలపర్చడం పారిపాటేగా! ప్రపంచ రాజకీయసంస్థ దగ్గర్నుంచీ పంచాయితీవరకూ, నేడు అనుసరింపబడే నవీనరాజనీతిసూత్రమ్మేఅదాయె

షావుకార్లవర్గానికి వెంకయ్య నాయకుడు మిగతా - వాళ్లచేత అలగాజనం అని పిలవబడేవాళ్లందరికీ - వీరాసామి నాయకుడు ఉండివుండి యిరువాగుల మధ్యా వొకదుమారం చెలరేగింది "దేనికైనా మీ సావుకార్లకే తగు, ఇళ్లచుట్టూ తాడెత్తు గోళ్లెట్టుగుంటారు సర్వే రాళ్లన్నీ మీపరమేగందా, దాల్లో కూచుని యేంజేస్తారో యెవరికి దెలుస్తుంది? పైగా మాబోటోళ్లమీద పడేడవడమెందుకంట?" అన్నాడు సూరయ్య అగ్గిపుల్ల గీసేసినట్టుగా "అది కాదోకే! అసలు తప్పజేసిందెవరో నడివీథిలో పెట్టి గూబలు నిక్కదియ్యాలి! ఆనాడు తెలుస్తుం దీళ్లమజాకా!" అన్నాడు వీరాసామి, మీసంమెలేస్తున్న ధోరణిలో

"అఁ సూసి తప్పెవరిదో జెప్పడానికి యీళ్లకి కళ్లేడిసినాయంటలే!" అన్నాడు బాపనరావు, నిర్భయంగా యెవర్నీ లెక్కజెయ్యనట్టు

"తమాయించండి, తమాయించండిరా! అబ్బాయిలూ, కుర్రోల్లజేతికి కత్తిస్తే కుతికమీదికి దెచ్చుకుంటారు ఇంతేమరి, సావుకార్లని కాస్త సూసి మాట్టాడండిరా!" అని వెనకనించి మందలించాడు గోపయ్య

"అఁ సావుకార్లయితే డబ్బుంటుంది చాటున, మాటున "

"ఛీ—నోరుముయ్యండి!" వెంకయ్య అరిచేశాడు వీరాసామి మాటమధ్యలో వుండగానే

"సరేగానీ, యెంతసేపటికీ ఆమాటే అంటారేం మీరంతా? ఇంకేమీ సమాధానం చెప్పకోలేరా? నోరుమూయించే విధం అదేనా?" అని వో విషపునవ్వునవ్వి కవ్వించాడు సూరయ్య

షావుకారు దామోదరానికి ఒళ్లు పొంగిపోయినట్టయింది కోపంతో "నా చేతులోనే తుపాకి వుంటేనా, వెదవల్ని గుప్పెడు బూడిదచేసి పారేద్దును" అన్నాడు కచ్చగా, పళ్లు బిగించి, చేయెత్తి గుప్పెట చూపిస్తూ.

వీరాసామి వెంటనే అందుకుని అన్నాడు "మీ బావమరిది సబిన్స్పెక్టరేగా, వోటి అడిగి తెచ్చుకోకపోయారూ?" అని

"అంత పని జరిగితేగాని వీళ్లకి బుద్ధొచ్చేట్టు లేదే మావాఁ!" అన్నాడు రాంకిష్టమ్మ వెంకయ్యవేపుకి తిరిగి

"నే నిప్పుడే సైకిలేసుకెళ్లి వోలారియేసుకొస్తా" అంటూ ఉత్తరయ్యం దులిపి బుజాన వేసుకున్నాడు షావుకారు దామోదరం

"ఏంటి, ముంజకాయలు కాదు గందా! అంటూ వికటంగా నవ్వేశాడు సూరయ్య

ముంజకాయకిమల్లేనే రాలగొట్టిస్తా వొకొక్కడితలే!" అంటూ లేచి నుంచున్నాడు దామోదరం

"బాబూ! ఏదో సర్దుకుపోరాదూ! ఆళ్ళతోపాటే మీరుకూడా 'సైఁ' అంటే 'సైఁ' అని నిలబడితే యిదేమన్నా తెమిలేదుస్తుందా యేవఁన్నానా? అయినా మీ

(38-వ పేజీ చూడండి)




# మబ్బుపిల్లలు

మూలం: టాగూరు - అనువాదం: ఎస్. వి. ప్రభాకరరావు

అల్లదే మబ్బుల్లో
పిల్లలరుగోనమ్మ!
మాటిమాటికి నాతో
మాటలాడుదురమ్మ!

"వేకువల కాంతిలో,
వెన్నెలల బాటలో,
తొలిమబ్బు తీగలా
తూగుటుయ్యాలల్లో
బంగారు భాస్కరుని
రంగుకిరణాలతో,
మెరుగులీనే వెండి
కిరణాల వెన్నెలతో,
ఆకాశవీధుల్లో
ఆడుకుందాము, రా,
పరుగులెడుతూ మనం
పాడుకుందాము, రా"

"కాని మిమ్ముల జేర
గలుగుటెట్టులు నేను?"
"పుడమికొన జేరి నిల
బడుము చేతులెత్తి,
ఆకసమునుండి ని
న్నందుకుంటాము.
ఆకాశవీధుల్లో
ఆడుకుందాము, రా.
పరుగులెడదాము, రా.
పాడుకుందాము, రా!"

"వెండిగిన్నెలో వేడి
వేడిబువ్వనుకలిపి
వెతుకుతూ మాయమ్మ
వేచివుంటుంది.
మబ్బుపిల్లలార
మిమ్ము చేరగ రాను
మాయమ్మ వద్దకే
మరలిపోతాను."

నవ్వుతూ వాళ్ళపుడు
నడచిపోయారమ్మ!
మబ్బుపింజల్లోకి
తప్పుకున్నారమ్మ.
కలకలా నవ్వుతూ
కనబడే చంద్రుణ్ణి
కౌగలించారమ్మ,
కప్పేశారమ్మ..
అంతకంటే బాగ
ఆడుకుందామమ్మ!
అంబాలయాకసవు
చందమామవు, నీవు!
మబ్బుతునకను నేను!
మన మేడ యాకసము!!
కలకలా నవ్వుతూ
కనబడే నిన్ను నే
కౌగలిస్తానమ్మ,
కప్పివేస్తానమ్మ.
అంబాలయాకసవు
చందమామవు నీవు!
మబ్బుతునకను నేను!
మన మేడ యాకసము!!




జరిగిన కథ —

1537 వ సంవత్సరంలో ఇంగ్లండురాజైన హెన్రీకి ఎడ్వర్డు అనే కొడుకూ, నిరుపేద జాన్ కాంటీకి టామ్ అనే కొడుకూ, ఒకేరోజున జన్మిస్తారు అదేం విచిత్రమోగాని ఇద్దరిదీ ఒకేపోలిక ఒకరోజున టామ్ రాజభవన కేసి వెళ్లగా యువరాజైన ఎడ్వర్డు అతన్ని లోనికి తీసుకుపోయి ఆదరిస్తాడు ఒకరి జీవితం ఒకరు చూడాలనే ఆసక్తితో దుస్తులు మార్చుకుంటారు ఎడ్వర్డు పేదదుస్తుల్లో బైటకురాగానే ప్రజలతన్ని పేదబాలుడుగానే భావిస్తారు అతడు తను యువరాజునంటున్న కొద్దీ అవమానిస్తారు అక్కడ యువరాజు వేషంలో ఉన్న టామ్‌ను ఎడ్వర్డే అని అంతా అనుకుంటారు అతడు తను పేదవాడినని చెప్పినా వినరు యువరాజుకే పిచ్చెక్కినట్లు భావిస్తారు ఈలోగా వృద్ధరాజు హెన్రీ చనిపోవడం, యువరాజుగా చెలామణీ అయ్యే టామ్ రాజు కావడం జరుగుతుంది అసలు రాజు ఎడ్వర్డును జాన్ కాంటీ తన కొడుకేనని భావించి బాధిస్తూఉంటాడు అతనిచేతుల్లోంచి ఎడ్వర్డును మైల్స్ హెండన్ అనే వీరయువకుడు రక్షిస్తాడుగాని ఎడ్వర్డు ఒక సారి జాన్ కాంటీకి, మరొకసారి ఒక పిచ్చి మతగురువుకు ఇంకోసారి పోలీసులకు బందీ అయి అనేకకష్టాలు పడతాడు

## 27

బాలరాజును ఊరిబయట ఫలానాచోట తనకోసం వేచిఉండవలసిందనీ, తానీలోగా ఇన్నాళ్లూ బసచేసిన సత్రానికి పోయి బాకీడబ్బు చెల్లించి శీఘ్రమే వచ్చేస్తానని హెండన్ చెప్పాడు

మరొక అరగంటకల్లా బాలరాజును హెండన్ సంకేతస్థలంలో కలుసుకున్నాడు లండన్ వంతెన మీది దుకాణంలో, బాలరాజు కోసం తాను ఇదివరకు కొన్న మంచి దుస్తులుకూడా హెండన్ తనతో తెచ్చాడు బాలరాజు తన పేలికలు విప్పి అవి తొడుక్కున్నాడు ఇప్పుడతనికి కాస్త వెచ్చగా ఉన్నది తన అశ్వరాజంమీద హెండన్ ఎక్కాడు గార్దభరాజంమీద బాలరాజు

అనువాదం:
శ్రీ
నండూరి రామమోహనరావు

ఎక్కాడు ఇద్దరూ హెండర్ల హాలు దిశగా ప్రయాణం సాగించారు.

బాలరాజును అట్టే ప్రయాస పెట్టడం మంచిది కాదనుకున్నాడు హెండర్. ప్రయాణపు బడలిక, వేళపట్టున భోజనం, నిద్ర లేక పోవడం మొదలైన వాటితో అతని ఆరోగ్యం ఇంకా చెడిపోవచ్చు. విశ్రాంతివల్ల అతని మనస్సు కాస్త కుదుటపడవచ్చు. ఎప్పటికైనా అతని ఉన్మాదం పోయి మామూలు మనిషి కాకపోతాడా అని హెండర్ గంపెడాశ పెట్టుకుని ఉన్నాడు కనుక తనమటుకు తనకు ఇంటికి చేరుకోవాలని ఎంత తొందరగా ఉన్నప్పటికీ బాలరాజు ఆరోగ్యందృష్ట్యా వీలైనన్ని మజిలీలు చేసుకుంటూ పోవడమే మంచిదని హెండర్ భావించాడు

పదిమైళ్లు దాటి వచ్చేసరికి ఒక గ్రామం తగిలింది ఆరాత్రికి అక్కడ ఆగి ఒక సత్రంలో బస చేశారు. భోజనాల సమయంలో పాత సంబంధాలు తిరిగి నెల్పకొల్ప బడ్డాయి, బాలరాజు భోంచేస్తుండగా హెండర్ కుర్చీవెనక చేతులు కట్టుకుని విధేయుడై నుంచున్నాడు కావలసినవన్నీ అందించాడు, మంచంమీద పరుండబెట్టి కాలు పలు కప్పాడు తాను యథాప్రకారం తలుపుదగ్గిర నేలమీదనే ముసుగుతన్ని పడుకున్నాడు

మరునాడు, ఆ మరునాడు, కులాసాగా కబుర్లు చెప్పకుంటూ ప్రయాణం సాగించారు. తాము లండన్ వంతెనమీద విడిపోయినప్పటినుండి జరిగిన స్వానుభవాలను ఒకరి కొకరు చెప్పకున్నారు హెండన్ తాను బాలరాజుకోసం ఎక్కడెక్కడ వెదికి ఏయే కష్టాలు పడిందీ చెప్పాడు, "దేవదూత" బాలరాజును చూపిస్తానని తన్ను అడవిఅంతా తిప్పాడు, చివరికి మళ్లీ పాకవద్దకే తీసుకువచ్చాడు- తరవాత లోపల పడకగదిలోకి వెళ్లి చూసి బాలరాజు రాలేదని చెప్పాడు, ఆరోజల్లా తాను అక్కడే బాలరాజుకోసం నిరీక్షిస్తూ గడిపాడు, చివరికి నిరాశచేసుకుని మళ్లీ అన్వేషణకు బయలుదేరాడు

"కాని మహారాజా! ఆ దేవదూత తమరు తిరిగిరాలేదని ఎంత విచారపడ్డాడనుకున్నారు?" అన్నాడు హెండన్

"అవును, ఎందుకు విచారపడడూ? నన్నుకూడా స్వర్గానికి పంపించాలని చూశాడు," అంటూ బాలరాజు తన కథంతా వినిపించాడు అంతా విని హెండన్,

"అరెరే! ఎంత తెలివితక్కువ మూర్ఖుణ్ణి! ఆ దేవదూత పిచ్చివాడనుకున్నానుగాని ఇంత దురాత్ముడనుకోలేదు లేకపోతే అప్పుడే వాణ్ణి ధ్వంసంచేసి స్వర్గానికి పంపేవాణ్ణి," అని ఎంతో నొచ్చుకున్నాడు.

ప్రయాణపు ఆఖరిరోజున హెండన్ ఉత్సాహం రెచ్చిపోయింది. నోరుఒక్కక్షణం ఊరుకోలేదు తన వృద్ధ జనకునిగూర్చి, అన్న ఆర్థర్‌ను గూర్చి, తన ప్రియురాలు ఎడిత్‌నుగూర్చి వాగుతూనే ఉన్నాడు ఆ సంతోషంలో తన కపకారంచేసినతమ్ముడు హ్యూనుగూర్చికూడా రెండుమూడు మంచి మాటలన్నాడు హెండన్ హాలుకు తను వెళ్లగానే అందరూ ఆనందాతిరేకంతో మూర్ఛపోతారన్నాడు, పెద్దపెద్ద ఉత్సవాలు జరుగుతాయన్నాడు

వాళ్లు ప్రయాణం చేస్తున్న ప్రాంతం మనోహరదృశ్యాలతో కన్నులపండువుగా ఉన్నది. విశాలమైన ఆ రోడ్డుకిరువైపులా పచ్చని పంటచేలు, చెట్లుచేమలు ఉన్నాయి, అక్కడక్కడ కాయగూరల తోటలు, పళ్లతోటలు ఎదురయ్యాయి ఒక్కొకచోట ఒకమాదిరి ఎత్తైన గుట్టలు కనిపించేవి. ఇక హెండర్ గ్రామం దగ్గిరికి వస్తోంఢనగా మైల్స్ హెండర్ ఉండబట్టలేక గుట్టలమీదికి ఎక్కేవాడు, తమ గృహం కనిపిస్తాయేమో నని పరిశీలించేవాడు. చివరికి ఒక గుట్టమీదనుండి అతని గ్రామం కనిపించింది సంతోషంగా అరిచాడు

"అదుగో మహారాజా! అదే మా ఊరు. ఆ కనిపించేదే మాఇల్లు ఎంత ఎత్తైన గోపురాలో చూడండి అది మాతండ్రిగారి ఉద్యానవనం. అహా! ఇప్పుడు మీకు తెలుస్తుంది, వైభవ విలాసాలంటే ఏమిటో? మా ఇంట్లో డబ్భయ్ గదులున్నాయి, ఇరవై ఏడుగురు పరిచారకు లున్నారు. ఎంత గొప్పో ఆలోచించండి ఊ. ఉరికించండి మీ గార్దభ రాజాన్ని అట్టే దూరం లేదు "

వాహనాలను నానా అవస్థపెట్టి పరిగెత్తించారు. అయినా గ్రామం చేరుకునేసరికి మధ్యాహ్నం మూడుగంటలు దాటింది. ఊళ్లో

(26-వ పేజీ చూడండి)



పాపం, సిండరెలా ఒంటరిగా ఏడుస్తూండగా, ఒక దేవత ప్రత్యక్షమౌతుంది "ఏడవకు తల్లీ! నిన్ను ఉత్సవానికి నే పంపిస్తాగా'" అని సముదాయిస్తుంది ఏవో మంత్రాలు చదివి, మంత్రదండంతో సిండరెలాను తాకుతుంది వెంటనే ఆమె వంటిమీది చిరుగుబట్టలుపోయి, అద్భుతమైన ఎట్టలు వస్తాయి కళ్లు జిగేల్మనిపించే తనదుస్తులు, ముఖ్యంగా, నక్షత్రాలుపొదిగిన గాజుస్లిప్పర్లు చూసుకుని సిండరెలా బలేఆశ్చర్యపోతుంది తరవాత ఆ దేవత తీగెలతో ఉన్న ఒక గుమ్మడికాయను చక్కని రథంగా మారుస్తుంది

‘‘సి
వాల్ట్‌డి
ఆర్





రెలా”
ర్టూన్ చిత్రం
డి తెూవిడుదల

నాలుగు చిట్టెలుకలను నాలుగు గుర్రాలుగానూ, సిండరెలా పెంచుతున్న గుర్రాన్ని సారథిగానూ, పెంపుడు కుక్కను సేవకుడుగానూ మారుస్తుంది కాని సిండరెలాను ఇలా హెచ్చరిస్తుంది "తల్లీ! నువ్వు అర్థరాత్రి పన్నెండుగంటలు దాటకుండా వచ్చెయ్యాలి ఆ తరవాత ఒక్కనిమిషం ఆలస్యమైనా, నా మంత్రం విచ్చిపోతుంది, నువ్వు మామూలుగా అయిపోతావు, జాగ్రత్త!" సరేనని సిండరెలా రథమెక్కి కోటకు అఘమేఘాలమీద వెళ్లిపోతుంది



ప్రవేశించారు. "ఇదే మా చర్చి— అది సత్రవ— ఆ పైది మార్కెట్టు- ఇది వసంతోత్సవాలు జరిగే చోటు— ఏమీ మారలేదు సుమండీ మాఊరు! పదేళ్ల కిందట ఎలా ఉండేదో ఇప్పుడూ అలాగే ఉంది. మనుషులుమాత్రం కొద్దిగా మారారు కొందర్ని గుర్తుపట్ట గలుగుతున్నాను గాని, నన్నెవరూ గుర్తుపట్టడమే లేదు ఈ పదేళ్లలో నేను చాలా మారివుంటాను—" అంటూ వాగుతున్నాడు హెండర్సన్ దోవపొడుగునా ఊరిచివరికి వచ్చారు వంకర టింకరగా, ఇరుకుగా ఉన్న ఒక సందులోకి వాహనాలు పోనిచ్చారు ఒక అరమైలు అలా పోగా పోగా ఒక పెద్దగేటు కనిపించింది రెండు నిలువులఎత్తున్న పెద్ద స్తంభాలు, వాటిమీద సింహ ప్రతిమలు ఉన్నాయి గేటుకు గేటు దాటి లోనికి ప్రవేశించగానే చల్లని పూలతోట, మధ్యలో బ్రహ్మాండమైన భవనం కనబడ్డాయి ప్రస్తుతానికి వారి ప్రయాణం ముగిసింది.

"స్వాగతం, రాజా, హెండర్సన్ హాలుకు హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నాను మిమ్మ.
ఈరోజు ఎంత సుదినం! మా తండ్రి, అన్న, ఎడిత్ నన్నుచూసి ఎంత సంతోషిస్తారో చెప్పలేను. రాజా! నా బంధువులు నేను వచ్చినసంతోషంలో తమరిని గమనించక పోవచ్చు అంతమాత్రాన మిమ్మ గౌరవించలేదనిచిన్నబుచ్చుకోవద్దు. ప్రథమ సంతోషం అయిపోగానే వారు మిమ్మ గౌరవించడమేకాదు, నేను మిమ్మెంత ప్రేమిస్తున్నానో తెలిస్తే వారుకూడా నెత్తినెక్కించుకుంటారు, పువ్వుల్లో పెట్టి పూజించగలరు కూడాను"

హెండసన్ గుర్రం దిగి బాలరాజును గాడీదనుండి దించాడు. బాలరాజును పొదివి పట్టుకుని నాలుగు అంగల్లో భవనసోపానాలు ఎక్కాడు. ఇంకొక నాలుగు అంగల్లో విశాలమైన ఒక హాల్లో ప్రవేశించారు. బాలరాజును ఒక ఆసనంమీద కూర్చుండబెట్టి హాలుకు ఒక చివర, వ్రాతబల్లముందు కూర్చుని ఏదో రాసుకుంటున్న యువకునివద్దకు పరుగెత్తాడు

"హ్యూ, హ్యూ, హ్యూ! నేను వచ్చాను రా, తమ్ముడా! నన్ను కౌగలించుకో! ఏరీ నాన్నగారేరీ! ముందు ఆయన కరస్పర్శ చేసేనే గాని నాకు తృప్తిలేదు, ఏరీ, ఎక్కడ?"

కాని హ్యూ తలెత్తిచూసి విస్మితుడై వెనక్కితగ్గాడు కొన్నిక్షణాలు మైల్స్‌ను తదేకంగా పరీక్షచేసి చూశాడు కనుబొమలు చిట్లించి, 'ఎవరోయ్ నువ్వు?' అన్నట్టు చూశాడు తుదకిలా అన్నాడు

"నీకు మతి భ్రమించినట్లుంది నూతనుడా! పాపం చాలా కష్టాలు పడినట్టున్నావు, నీవాలకం, దుస్తులు చూస్తే అలాగే అనిపిస్తోంది. పాపం, నన్నెవరనుకుంటున్నావు"

"నువ్వెవరివో నేను గుర్తుపట్ట లేదనా నీ ఉద్దేశ్యం? నువ్వు హ్యూ హెండసన్‌వి కాక ఇంకెవరివి?" అన్నాడు మైల్స్ కొంచెం తీవ్రంగా.

హ్యూ నిశ్చలంగా మళ్లీ ప్రశ్నించాడు

"సరే, నువ్వెవరి వనుకుంటున్నావు?"

"ఇందులో అనుకోవలసిన అవసరమేమీ లేదు. నేనెవరినో నాకెంత తెలుసో, నీకూ అంతే తెలుసు నేను మైల్స్ హెండసన్ నని నీకు నిస్సందేహంగా తెలుసు"

హ్యూ ముఖంలో సంతోష భావం కదిలింది

"ఏమిటి? ఇది నిజమే? చచ్చిపోయినవారు తిరిగి రాగలరా? వస్తే చాలాఅదృష్టవంతుణ్ణే పాపం, మా చిన్నన్న ఏడేళ్ల కిందట చనిపోయినవాడు తిరిగి బతికి వచ్చాడంటే ఎవరు సంతోషించరు? ఇదుగో నూతనుడా? నాతో వేళాకోళమాడకు ఏదీ, వెలుగులోకి రా, సరిగ్గా చూడనీ నిన్ను"

హ్యూ రెక్కపట్టుకుని మైల్స్‌ను కిటికీ వద్దకు లాక్కువెళ్లాడు నఖశిఖపర్యంతం అతన్ని పరీక్షించాడు

"ఊ ఇంకా పరీక్షించు బాగా చూడు నేను నీ చిన్నన్ననే అవునా? ఇప్పుడు నమ్మకం కలిగిందా? అనుమానం తీరిందా? నేను మైల్స్‌నేకదూ? ఆ రా తమ్ముడా! కౌగలించుకో. సంతోషం పట్టలేకుండా ఉన్నాను"

కాని హ్యూ అతన్ని నెట్టివేశాడు.

"అయ్యో, ఎంత దురదృష్టవంతుణ్ణి! ఇంకెక్కడి చిన్నన్న! ఆ దేవుడు నన్నైనాతీసుకుపోలేదు," అంటూ హ్యూ కళ్ల నీళ్లు తుడుచుకున్నట్టు నటించాడు.

"హ్యూ! నేను మైల్స్‌ను కానా?"

"కావు. ఆ ఉత్తరంనిజమే నన్న మాట"

"ఏ ఉత్తరం?"

"అదే ఆరేళ్లకిందట గాబోలు విదేశాలనుండి వచ్చింది నాచిన్నన్న యుద్ధంలో మరణించాడని ఎవరో స్నేహితుడు మానాన్నగారికి రాశాడు"

"అబద్ధం! మోసం! ఏరీ నాన్నగార్ని పిలు ఆయన నన్ను గుర్తిస్తారు"

"చనిపోయిన వాళ్ల నెలా పిలవడం?"

"చనిపోయారం? నాన్నగారు పోయారా?" అని మైల్స్ రుద్ధకంఠంతో అన్నాడు అతని పెదిమలు దుఃఖావేగానికి కంపించాయి. "అయ్యో! ఎంత మంద భాగ్యుణ్ని ఎవరి సందర్శనం కోసం ఇన్నాళ్లు కలవరించానో ఆయనని చూసేభాగ్యం లేదు నాకు. సరే, అన్న ఆర్థర్ నైనా పిలు"

"అతడు కూడా చనిపోయాడు,"

"ఏమిటిది? నా సంతోషం చల్లారిపోయింది ఎంత ఉత్సాహంతో వచ్చానో, అంత క్రుంగదీసే వార్తలు వినిపిస్తున్నాయి. ఎడిత్ —"

"ఆమె బ్రతికే ఉన్నది"

"ధన్యుణ్ణి నాసంతోషం తిరిగి వచ్చింది హ్యూ! వెంటనే పరుగెత్తుకొనిపో ఆమెను తీసుకురా. ఆమె నన్ను తప్పక గుర్తుపట్టుతుంది కావలిస్తే మన పూర్వసేవకులను కూడా పిలు, వాళ్లుకూడా నన్ను గుర్తిస్తారు"

"అందరూ చనిపోయారు, అయిదుగురుతప్ప పీటర్, హాల్సీ, డేవిడ్, బెర్నార్డు, మార్గరెట్ మాత్రమే మిగిలారు," అని హ్యూ హాల్లోంచి లోపలికి పోయాడు.

"విశ్వాసపాత్రులైన ఇరవై ఇద్దరు నౌకర్లు చనిపోయి, దుష్టులైన ఈ అయిదుగురే మిగిలారా? ఎంత వింత?" అనుకుంటూ మైల్స్ హాల్లో అటూ ఇటూ కాలుగాలిన పిల్లిలాగ పచార్లు చేయనారంభించాడు బాలరాజుఉనికిని పూర్తిగా విస్మరించాడు కొంతసేపటికి బాలరాజే అన్నాడు

"వీరుడా! నీ దురదృష్టానికి చింతించకు నీమాదిరిగానే గుర్తుపట్టబడనివాళ్లు, హక్కులు పోగొట్టుకున్నవాళ్లు ప్రపంచంలో మరికొందరుండవచ్చును అలాంటివాణ్ణే నేను మనలనిద్దరినీ ఒకే దురదృష్టం వరించింది కనుక నువ్వు చింతించనక్కర్లేదు"

హెండన్ సిగ్గుపడ్డాడు. "రాజా! నా చిట్టిరాజా! మీరు నన్ను వేళాకోళం చెయ్యకండి నేను మోసగాణ్ణి కాను ఆగండి మీరే చూస్తారు, ఇంగ్లండులోకల్లా మధురాతి మధురాలైన అధరాలద్వారా మీరు వింటారు నేనెవరో. ఆమెను రానివ్వండి.. నేను మోసగాణ్ణా! అరె నాకు ఈ హాలులో ప్రతిమూల మూల తెలుసునే! నా పూర్వీకులవైన ఈ చిత్రపటాలన్నీ నాకు గుర్తే నేనిక్కడ పుట్టాను, పెరిగాను. నేను దైవసాక్షిగా చెబుతున్నాను ఈమాట. అందులో మీతోకూడా అబద్ధమాడతానా? ప్రభూ! ఎవరు నమ్మినా, నమ్మకపోయినా, మీరైనా నన్ను విశ్వసించండి"

"నిన్ను మనఃపూర్తిగా విశ్వసిస్తున్నాను సర్ మైల్స్!"

"మీకు సర్వదా కృతజ్ఞుణ్ని," అన్నాడు మైల్స్. బాలరాజు అమాయకత్వం అతని హృదయాన్ని ముల్లులాగ తాకింది కాని బాలరాజు వెంటనే ప్రశ్నించాడు

"సర్ మైల్స్! మరినువ్వు నన్ను విశ్వసిస్తావా?"

దొంగతనం చేసి పట్టుబడినట్టు మైల్స్ కంగారుపడ్డాడు ఈ ప్రశ్నకు జవాబేమీ తోచలేదు కాని ఇంతలో హ్యూ వచ్చాడు; మైల్స్ జవాబివ్వకుండా తప్పించుకున్నాడు.

హ్యూ, వెనకాలే ఒక సుందరి వచ్చింది. ఆమెవెనుక నౌకర్లు వచ్చారు సుందరి నేలనేచూస్తూ నడిచివచ్చింది తల ఎత్తకపోయినా ఆముఖంలో ఏదో చెప్పలేని విచా

రం గూడుకట్టుకున్నట్టు కనిపిస్తోంది. ఆమెను చూడగానే మైల్స్ ముందుకు అడుగువేసి,

"ఎడిత్! ప్రియా! హృదయేశ్వరీ!" అన్నాడు.

హ్యూ అతన్ని వెనక్కినెట్టి, "అతన్ని చూడు, గుర్తుపట్టగలవేమో?" అన్నాడు

మైల్స్ కంఠం విని వినగానే సుందరి ఉలికిపడింది, బుగ్గలు ఎర్రబడ్డాయి, పెదిమలు వణికాయి మెల్లిగా తల ఎత్తింది భయపడిన లేడికూనవలె బిత్తరిచూపులు చూసింది క్రమంగా ముఖం పాలిపోయింది నూతిలోంచి మాట్లాడినట్టు, "అతన్ని నేనెరగను," అన్నది గిరుక్కున మరలి, వచ్చిన దారినే వెళ్లిపోయింది కాని ఏడుపును దిగమింగుతున్నట్టు ఆమె మూలగడం స్పష్టంగా వినిపించింది.

మైల్స్ పిడుగు పడినవాడివలె ఒక కుర్చీలో కూలబడి ముఖం రెండు చేతులా కప్పుకున్నాడు. హ్యూ నౌకర్లను అడిగాడు:

"అతన్ని చూశారుగా, మీరెవ్వరైనా ఎరుగుదురా అతన్ని?"

నౌకర్లు ఒక్కొక్కరే తలలు అడ్డంగా ఊపారు.

"నౌకర్లు కూడా నిన్నెరగరు నూతనుడా! బహుశా నువ్వు పొరబడి ఉంటావు నాభార్యకూడా నిన్నెరగనన్నది, చూశావుగదా!"

"నీ భార్యా?" ఎవరో తన నులుముతున్నట్టు తన కంఠం రెండు చేతులా పట్టుకున్నాడు మైల్స్ "ఓరి గోముఖవ్యాఘ్రమా! నువ్వు నా ప్రియురాలిని కూడా అపహరించావా? అదీ. ఇప్పుడంతా అర్థమైంది. ఆ దొంగఉత్తరం, నేను చనిపోయినట్టు వ్రాసినది, నువ్వే సృష్టించావు. ఆ తరువాత ఎడిత్‌ను పెళ్లి చేసుకుని ఆమె ఆస్తినికూడా సంగ్రహించావు. ఛీ, కుక్కా! అవతలికి పో నా కళ్లఎదుట నిలవకు లేకపోతే నీలాంటి విశ్వాసఘాతకుని రక్తంతో నా కత్తిని మలినం చేసుకోవలసివస్తుంది"

హ్యూ ముఖం కందగడ్డలా ఎర్రబడింది అవమానంతో కాళ్లు నిలదొక్కుకో లేకపోయాడు, "ఈ మోసగాణ్ణి బంధించండి," అని సేవకులకు ఆజ్ఞాపించాడు వాళ్లు సందేహించారు, ఒకడన్నాడు

"అతనివద్ద ఆయుధం వుంది సర్ హ్యూ! మాదగ్గిర ఏమీ లేదు"

"ఆయుధం ఉన్నదా? ఉంటేనేం? మీరిందరున్నారు, పట్టుకోలేరూ? ఊఁ, చూస్తారేం? మీద పడండి"

కాని మైల్స్ కత్తిదూసి ఝుళిపించాడు

"విశ్వాసహీనులారా! నన్ను మీరు బాల్యంనుంచీ ఎరుగుదురు. నా చేతులో కత్తివుంటే ఎదుటివాడి కెంత ప్రమాదమో మీకు బాగా తెలుసు. చేవ ఉంటే ముందుకు రండి," అని హెచ్చరించాడు. నౌకర్లు తమకు చేవ లేదన్నట్లు వెనక్కి తగ్గారు.

"ఛీ పిరికిపందల్లారా! పొండి కత్తులు తెచ్చుకోండి. సింహద్వారం, బయటగేటు అన్నీ బందుచెయ్యండి పోలీసులకోసం ఒకణ్ణి పరిగెత్తించండి," అని హ్యూ ఆజ్ఞాపించాడు మైల్స్ కేసి తిరిగి, "నూతనుడా! నువ్వు పారిపోదామని వృథాగా ప్రయత్నించకు. అది నీకే మంచిది కాదు," అన్నాడు.

"పారిపోవడమా? అది కల్ల. నువ్వేమీ బెంగపడకు నీలాటి అధమాధములకు జడిసి పారిపోయే ఘటం కాదిది ఇకనుంచీ హెండన్ హాలుకు, యావదాస్తికీ అధిపతి మైల్స్ హెండన్. అత డిక్కడనుండి ఒక్క అంగుళమైనా కదలడు సందేహించనక్కర్లేదు నువ్వు"



## 28

ఇంతసేపు బాలరాజు తనలో తాను దీర్ఘాలోచన చేస్తున్నాడు. చివరికి తలఎత్తి అన్నాడు.

"చాలా వింతగా ఉంది. ఎందుచేతనో అర్థంకావడం లేదు."

"లేదు ప్రభూ! ఇందులో వింత ఏమీ లేదు. నేను హ్యూను చిన్నతనంనుండి ఎరుగుదును, వాడి స్వభావమే అంత."

"అతన్నిగూర్చి కాదు నేననేది"

"మరేమిటీ? ఏమిటా వింత? మీరనేది బోధపడలేదు."

"మహారాజు ఏమయ్యారని ఎవరూ అనుకోవడంలేదేమాఅని"

"ఎందుకు? ఎవరు? ఏమిటి?"

"అది కాదోయ్ సర్ మైల్స్! నేను కనిపించడంలేదని ప్రజలెవ్వరూ ఆందోళనపడడం లేదేమా అని అడుగుతున్నాను నా ఆకారాన్ని వర్ణిస్తూ ప్రకటనలు చెయ్యడంగాని, దేశమంతటా అన్వేషణగాని, ఏమీ జరగడంలేదు నేను మాయమైపోవడం దేశానికి విచారకారణం కాదా?"

"ఓ అదా? అవునవును ప్రభూ! విచిత్రంగానే వుంది," అని 'పాపం ఇతని మనస్సు ఇంకా ఆ దుస్వప్నాల వలలోనే చిక్కుకున్నది" అని లోపల అనుకున్నాడు హెండన్

"సర్ మైల్స్! నాకొక ఉపాయం తట్టుతున్నది దాంతో మనిద్దరి కష్టాలు గట్టెక్కగలవు. నేను లాటిన్, గ్రీకు, ఇంగ్లీషు భాషల్లో శ్రీముఖం ఒకటి వ్రాస్తాను నువ్వు రేపు చీకటతో లేచి దాన్ని లండన్ తీసుకుపోవాలి నా మేనమామ హెర్టుఫర్డు ప్రభువుకు తప్ప మరెవరికీ ఇవ్వగూడదు దాన్ని ఆయన చూడగానే నేనే రాశానని గుర్తుపడతాడు. నాకోసం మనుషులను వెంటనే పంపుతాడు"

"ప్రభూ! నాదొక చిన్నమనవి. నా వారసత్వపు హక్కులవిషయం ఏదో తేలేదాకా మన మిక్కడే ఉండటం మంచిది నా హక్కులు తిరిగిపొందినప్పుడు నాకు కాస్తపలుకుబడి కూడా వుంటుంది అప్పుడు మన మేది చేసినా చెల్లుతుంది."

బాలరాజు రాజోచితంగా కోపం చూపిస్తూ అన్నాడు

"మూర్ఖుడా! ఒక దేశం, ఒక రాజవంశం, ఒక సింహాసనం ప్రమాదపరిస్థితిలో పడినప్పుడు నీ వారసత్వం, నీహక్కులు, నీచిల్లర ఆస్తిపాస్తులు ఏమూలకి?" కాని వెంటనే అంత తీవ్రంగా మాట్లాడినందుకు నొచ్చుకుని గొంతు తగ్గించాడు "నా ఆజ్ఞ పాలించు భయపడకు సర్ మైల్స్! నేను నీహక్కులను రక్షిస్తాను, నీకు న్యాయం చేస్తాను నీ సేవకు, స్వామిభక్తికి నేను ప్రతిఫలం ముట్టజెబుతాను"

బాలరాజు లేచి వ్రాతబల్ల వద్దకు వెళ్లి కాగితం, కలం తీసుకుని వ్రాయసాగాడు. మైల్స్ అతని వంక వాత్సల్యంతో చూస్తూ ఇలా అనుకున్నాడు:

"ఇదే చీకటిసమయమైతే ఈ మాటలు స్వయంగా మహారాజే అన్నారని భ్రమించే వాణ్ణి సందేహంలేదు. ఈ బాలుడు ఈ ట్రిక్కు ఎక్కడ నేర్చుకున్నాడో గాని, కోపంవచ్చినప్పుడు నిజమైన రాజువలె పిడుగులు వర్షిస్తాడు చూడు, ఆ బల్లవద్ద కూర్చుని ఎలా పిచ్చిగీతలు గిలుకుతున్నాడో? అదంతా లాటిన్ గ్రీక్ అనే అతని భావన. రేపుదయం ఏదో మాయమాటలు చెప్పి నమ్మించకపోతే నన్ను లండన్‌కు తరిమిందాకా ఊరుకోడు"

మైల్స్ ఆలోచనలు అప్పుడే జరిగిన సంఘటనపైకి పోయినై. వాటిలో అతడు నిమగ్నుడై ఉండటంచేత బాలరాజు కాగితం మడిచి ఇవ్వడం, అది తీసుకుని తను జేబులో పెట్టుకోవడం కూడా హెండన్‌కు జ్ఞాపకంలేదు. "ఎంత చిత్రమైన విషయం జరిగింది! కలలో కూడా ఇలా జరుగుతుందని ఆశించలేము. కనీసం ఆమెయైనా నన్ను గుర్తిస్తుందనుకున్నాను. నాముఖం, ఆకారం, కంఠం ఆమె తప్పక గుర్తించిఉంటుంది అయినా ఎరగనని ఎందుకన్నది? అబద్ధమాడుతుందా, నా ఎడిత్?—ఆ, అది, అసలు విషయం! బహుశా హ్యూ ఆమెను బెదిరించిఉంటాడు ఆమెను చూడగానే ఏదో గొప్ప భయంలో ఉన్నట్టు తోచింది అతడే బెదిరించి, ఎరగనని అనిపించిఉంటాడు ఆమె నివతలకు పిలిచి అడుగుతాను, ఒంటరిగా అడిగితే నిజం చెప్పక మానదు చిన్ననాటి విషయాలు, మేము కలసిమెలసి ఆడిన ఆటలు, పాడిన పాటలు జ్ఞాపకం చేస్తాను ఆమె హృదయం

చలించక మానదు, ఆమె స్వభావం నే నెరగనా? నిష్కల్మషమైన స్వభావం ఆమెది నన్ను ఆ రోజుల్లో ఎంతో ప్రేమించేది ఇప్పుడు నన్ను మోసగిస్తుందా?—" అనుకుంటూ లోపలి గదిలోకి అడుగు పెట్టబోయాడు అంతలో తలుపు తెరుచుకుని ఎడిత్ ఒంటరిగా వచ్చింది

ఆమె ముఖం ఇంకా పాలిపోయే ఉన్నది ఇందాకటివలెనే విచార మేఘాలు ముఖంనిండా ఆవరించి ఉన్నాయి అయినా, ఆమె సౌందర్యంగాని, సహజశీలిగాని అణుమాత్రమైనా మరుగుపడలేదు మైల్స్ చేతులు సాచి ముందుకు వచ్చాడు ఆమె దూరంగా తొలిగి ఒక కుర్చీలో కూర్చుని, ఇంకో కుర్చీలో కూర్చోమని సైగచేసింది పరాయివాణ్ణి చూసినట్టు ఆమె చూడడంతో అతని ఉత్సాహం చచ్చింది కుర్చీలో కూలబడ్డాడు ఎడిత్ అన్నది

"మిమ్మల్ని హెచ్చరించిపోదామని వచ్చాను ఇక్కడ మీరు ఆలస్యంచడం అపాయకరం మీరు పొరబాటున ఏదో భ్రాంతిలో పడ్డారు ఆ భ్రాంతి తొలగించుకోకపోతే మీకే చాల చిక్కు" ఎడిత్ ఒక్కక్షణంసేపు మైల్స్ ముఖంలోకి లోతుగా చూసింది "మా చిన్న బావ పోలికలు మీకు కొన్ని ఉన్నాయి అందుచేత మీ రిక్కడ ఉండటం ఇంకా ఎక్కువ అపాయం"

"ఎడిత్! నేనే నీ చిన్న బావని"

"అది మీ విశ్వాసం మీ విశ్వాసాన్ని నేను కాదనలేను కాని నేను హెచ్చరిస్తున్నాను, నా భర్త ఈ నరగణాకు ఏకచ్ఛత్రాధిపతి ఇక్కడి ప్రజల ప్రాణాలు ఆయన పిడికిలిలో ఉన్నాయి మీలో మా చిన్న బావపోలికలు లేకపోతే ఆయన మీదారిని మిమ్మల్ని పోనిచ్చేవారు కాని ఇప్పుడాయన ఏంచేస్తారో నాకు బాగా తెలుసు మీ రెవరో మోసగాళ్లని ప్రకటిస్తారు, అందరూ ఆ మాటనే ప్రతిధ్వనిస్తారు మీరు నిజంగా మైల్స్ హెండన్ అయినప్పటికీ, ఆ సంగతి ఆయనకి, ప్రజలకి కూడా తెలిసినప్పటికీ, మీకు అపాయం తప్పదు, మీ తరఫున వాదించే మనిషి ఉండడు బాగా ఆలోచించుకోండి నే చెప్పేది"

"ఆలోచించుకున్నా నమ్మా!" అన్నాడు మైల్స్ తీవ్రస్వరంతో "ప్రేమించిన యువతి చేతనే ఎరగనని అనిపించినవాడు ఇంకేం తయినా చేయించగలడు"

ఎడిత్ ముఖం ఎర్రపడింది, కళ్లు నేలకు వాలిగవి, కంఠం వణికింది

"మీరు వెంటనే వెళ్లిపొండి నా భర్త మిమ్మల్ని నాశనం చేసేదాకా నిద్రపోరు ఆయన నిర్దయుడు నేను ఆయనకు బానిసను కనుక, ఆయన స్వభావం ఎరుగుదును మైల్స్, ఆర్థర్, మామగారు రిచర్డు అందరూ ఈయన బాధల నుండి విముక్తిపొందారు నేను మాత్రం దుఃఖం అనుభవించడానికి మిగిలాను మీరు తక్షణం దూరంగా పారిపొండి సందేహించవద్దు, వెళ్లండి మీదగ్గిర డబ్బు లేకపోతే ఈ పర్సు తీసుకోండి"

మైల్స్ పర్సు వద్దన్నాడు, లేచి ఆమె ఎదుట నుంచున్నాడు

"ఒక్క మాట ఒక్కసారి నాకేసి చూడు నేను మైల్స్



మైల్స్‌హెండని బాలరాజులను శత్రుభటులు చుట్టుముట్టిన దృశ్యం

# మహాకవి టాగూర్ వర్ధంతి:



బాలలారా! "జనగణమన అధినాయక జయహే!" అనే పాట మీరు చాలసార్లు వినే వుంటారు ఇది మన జాతీయగీతం దీన్ని వ్రాసినకవి రవీంద్రనాధ టాగూర్ ఈయన 1941 సంవత్సరంలో ఆగస్టు 7 వ తేదీన కీర్తి శేషు లయ్యారు

రవీంద్రనాధ టాగూర్ బెంగాలీకవి బెంగాలీ భాషలో ఈయన కొన్ని వేల పాటలు, పద్యాలు రాశారు ఎన్నో కథలు, నవలలు, నాటకాలు, వ్యాసాలు కూడా రాశారు ఇవన్నీ అనేక



ఇతర భాషల్లోకి కూడా తర్జుమా అయి, టాగూరుకు ప్రపంచమంతటా పేరు సంపాదించిపెట్టాయి ఆయన ఇంగ్లీషులో రాసిన "గీతాంజలి" అనే కావ్యానికి 1913 సంవత్సరంలో స్వీడన్‌లోని "నోబెల్ బహుమాన సంఘం" వారు నోబెల్ బహుమతి ఇచ్చారు.

టాగూర్ 1861 వ సంవత్సరంలో పుట్టారు ఈయన తండ్రి మహర్షి దేవేంద్రనాధ టాగూర్. తండ్రి స్థాపించిన "శాంతినికేతనం" అనే ఆశ్రమాన్ని రవీంద్రుడు "విశ్వభారతి" పేరుతో ఒక పెద్ద విద్యాసంస్థగా అభివృద్ధి చేశారు. విశ్వభారతిలో ఇప్పటికీ దేశదేశాలనుంచి వచ్చిన విద్యార్థులు కొంతకాలం ఉండి వివిధ విషయాలు అభ్యసించి పోతూ ఉంటారు ఈమధ్యనే విశ్వభారతిపై భారత ప్రభుత్వం వారు శ్రద్ధతీసుకుని వృద్ధిచేస్తున్నారు

టాగూరు బాల బాలికలకోసం జోలెడు పాటలు, కథలు, నాటికలు రాశారు పిల్లల మనస్సు, ఆలోచనలు ఈయన తరిచినంతగా ఇంకెవ్వరూ తరచలేదనిపిస్తుంది. పిల్లలకు సహజంగా వచ్చే భావాలు, ముద్దులుమూటగట్టే భాషలో ఆయన రాశారు. అసలు ఆయన కవిత్వమంతా హాయిగొలిపే భావాలతో, ఒయ్యారమైన భాషతో మైమరిపిస్తుంది. ఆయన కవిత్వంలో ఏ పేజీనిముట్టుకున్నా వేణుసంగీతాలు, కోకిల కూజితాలు వినిపిస్తాయి, పువ్వులు, మబ్బులు, ఉషఃకాంతులు, వెన్నెలలు కనిపిస్తాయి అందుకే కొందరు టాగూర్ ప్రపంచంలోని ఆనందాన్ని వర్ణించినంతగా దుఃఖాన్ని వర్ణించలేదని అంటూ వుంటారు.

ఏమైనా టాగూర్ భారతదేశపు గొప్పకవుల్లో ఒకరు. తన మధుర కవిత్వంతో, దేశభక్తి గీతాలతో ఆయన దేశాన్ని ఉర్రూతలూగించారు. మీరు పెద్దవారయ్యాక ఆయన పుస్తకాలన్నీ చదివి ఆయన గొప్పతనాన్ని పూర్తిగా తెలుసుకోండి ★

---

హెండన్‌ని అవునా, కాదా? నిజం చెప్పు"

"ఉహూ! మిమ్మునే నెరగను"

"ప్రమాణంచేసి చెప్పు"

"ప్రమాణపూర్తిగా. ఊ ఇక ఆలసించకండి ఆక్షేప్యవధిలేదు"

మైల్స్ హెండన్ మారుమాట లేకుండా వెనక్కి తిరిగి తన టోపీ తీసుకున్నాడు, బాలరాజును వెంటపెట్టుకుని ద్వారాలన్నీ దాటి వీధిలోకి వచ్చాడు వెంటనే అతన్ని ఆయుధాలు ధరించిన రక్షకభటులు చుట్టు ముట్టారు. అతను కత్తితీయడానికైనా వ్యవధి లేకపోయింది. మైల్స్‌ను, బాలరాజును బంధించి రక్షక భటులు జైలుకు తీసుకుపోయారు.

(ఇంకావుంది)




పూర్వకాలంలో ఒకానొక ప్పుడు, ఒకానొక దూరసముద్రంలో ఒకానొక ఏకాంతద్వీపం ఉండేది. అక్కడ రాజులు రాణీలు, ఆసులు జాకీలు నివసించేవారు. పదులు తొమ్మిదులు, రెండులు మూడులు కూడా మిగతా పోడిముక్కలతో పాటు అక్కడే ఉండేవారు. అందు చేత దానికి పేకముక్కల రాజ్యమనే పేరువచ్చింది.

ఆసులు, రాజులు, జాకీలు అగ్ర వర్ణాలకు చెందినవారు. పదిబంతుల నుండి మిగతా వారంతా అధమ వర్ణులు. రెండు బంతులు అందరి కంటే తక్కువ కులానికి చెందిన వారు అగ్రవర్ణులతో అధమ వర్ణులకు సంబంధ బాంధవ్యాలు లేవు. వారు అధికారులు, వీరు సేవకులు అంతే.

పేకముక్కల రాజ్యంలో వర ధర్మాలు, ఆచారాలు విచిత్రమైన వవి. జన్మనిబట్టి కులం, కులాన్ని బటి వృత్తి నిర్ణయింప బడతాయి. చెయ్యడానికి వీల్లేదు. అసలు ఒక విషయాన్ని గూర్చి ఆలోచించ డానికి, నిర్ణయం చెయ్యడానికి, చర్చించడానికి ఎవడికీ ఎప్పుడూ అవసరం కలగలేదు ప్రతివాడూ ముక్కుక్కు సూటిగా, మాటా మంతీ లేకుండా నడవవలసిందే. ఎవ రైనా కిందపడితే చప్పుడే అయ్యేది కాదు; ఆకాశానికి గుడ్లప్పగించి చూసేవాడు, అంతే

ఆరాజ్యంలో ఎప్పుడూ ఒకే నిశ్శబ్దం, ఒకే ప్రశాంతి, ఒకే సంతృప్తి ఏ పేకముక్కా తన హక్కుల్ని గూర్చి పేచీపెట్టలేదు; ఏవిషయాన్ని గూర్చి ఆందోళన గాని, సంతోషంగాని, ఉత్సాహం గాని చూపించలేదు. సముద్రం ఎడతెగని జోలపాట పాడేది, తరంగాల చేతులతో జోకొట్టేది, తల్లి ఒడిలో శిశువులాగా ఆద్వీపం ఎన్నో శతాబ్దాలనుంచీ నిద్రతో సమానమైన జడజీవితం గడుపుతోంది. ఆద్వీపాన్ని చేరుచుకుని రాలేక పోయేవి.

## 2

సముద్రాల కవతల, కొండల కవతల ఒక దేశం ఉన్నది. అక్కడ ఒక రాజకుమారుడు దుఃఖతురాలైన తల్లితో రాజధానికి దూరంగా సముద్రతీరపు పల్లెలో నివసించేవాడు ఆరాణిని రాజుగారు ఏదో కారణంమీద కోపంవచ్చి వెళ్లగొట్టారు ఆమె తన ఒక్కగాని ఒక్క పుత్రుడితో ఆ పల్లెటూరులో దినాలు వెళ్లబుచ్చుతున్నది. సాయంకాలం సూర్యాస్తమయమైన తర్వాత గడపలో కూర్చుని ఆమె కుమారుడికి తమాషా కథలు చెప్పేది అవి వింటూ రాజకుమా రుడు తను పెద్దయ్యాక రెక్కల గుర్రంకోసం, నాగేంద్రుడి పడగ మీది మణికోసం, స్వర్గంలోని పారిజాతంకోసం బయల్దేరి పోవాలని కలలు కనేవాడు. రాత్రి రాజు కోటలో బంధింపబడిన రా

బళ్ళో అతనికి ఇద్దరు మిత్రులున్నారు. ఒకడు కోటీశ్వరుడైన వర్తకుని కొడుకు. రెండోవాడు కొత్వాలు కుమారుడు వర్తకుని కొడుకు సింద్ బాద్ సముద్రప్రయాణాల కథలు చెప్పేవాడు కొత్వాలు కొడుకు రాక్షసుల కథలు చెప్పేవాడు వాన హోరుమని కురుస్తూ, ఆకాశమంతా మబ్బుల మయమైన వేళ గడపవద్ద కూర్చుని రాజకుమారుడు అడిగేవాడు: "అమ్మా! నాకో మంచి కథ చెప్పవూ?"

ఆమె కళ్లనీళ్ళు తుడుచుకుని దూరదేశాల విచిత్ర కథలు చెప్పడం మొదలుపెట్టేది. జోరున కురిసే వానవంక నోరు తెరుచుకుని చూస్తూ అతడు కథలు వినేవాడు.

క్రమంగా రాజకుమారుడు పెద్దవాడయ్యాడు, ఒకరోజున వర్తకుని కొడుకు వచ్చి "మిత్రమా! నా చదువు పూర్తయింది నేను దేశాలు తిరిగి డబ్బు సంపాదించుకు రావాలని సముద్రప్రయాణం తలపెట్టాను. నీతో చెప్పి పోదామని వచ్చాను," అన్నాడు.

"నేనూ వస్తాను నీతో" అన్నాడు రాజకుమారుడు. కొత్వాలుకొడుకు వచ్చి, "మిత్రులారా! చిన్నప్పటినుండి మనం కలిసిమెలిసి తిరిగాం. నేను మిమ్మల్ని విడిచి ఉండలేను. నన్నూ తీసుకుపొండి," అన్నాడు.

తరవాత రాజకుమారుడు తల్లి వద్దకు వెళ్లి చెప్పాడు "అమ్మా! నేను అదృష్టాన్ని వెదుక్కుంటూ వెడుతున్నాను: నేను తిరిగి వచ్చాక కష్టాలన్నీ గట్టెక్కిస్తాను ఆశీర్వదించి పంపించు"

ముగ్గురు మిత్రులు ప్రయాణ సన్నాహాలు కావించుకుని బయల్దేరారు. రేవులో వర్తకుని ఓడలు పన్నెండు సిద్ధంగా ఉన్నాయి మన మిత్రులు ఒక ఓడలో ఎక్కారు. దక్షిణవాయువులు శుభప్రదంగా వీస్తున్నాయి పన్నెండు ఓడలు లంగరెత్తి మెల్లిగా ప్రయాణం సాగించాయి.

శంఖద్వీపంవద్ద ఆగి వారు ఒక ఓడనిండా శంఖాలు నింపుకున్నారు. చందన ద్వీపంవద్ద గంధపు చెక్కలతో మరొక ఓడ నింపారు. ముత్యాల దీవిలో ముత్యాలు నింపుకున్నారు ఇలాగే ఒక్కొక్క చోట ఆగి దంతం, కస్తూరి, జాజికాయలు, ఇతర సుగంధద్రవ్యాలతో అన్ని పడవలూ నింపుకున్నారు.

ఈవిధంగా నాలుగేళ్లు సముద్రాల్లోనే ప్రయాణం సాగించారు. కాని ఓడలన్నీ నిండిన తరవాత ఒకరోజున పెద్ద తుపాను రేగి ఓడలన్నీ మునిగిపోయాయి. ఎన్నో లక్షలు ఖరీదు చేసే ముత్యాలు, గంధపుచెక్కలు, దంతం అన్నీ నాశనమయ్యాయి. కాని మన మిత్రులెక్కిన ఓడ మాత్రం తుపాను గాలికి ఎటో కొట్టుకుపోయింది. కొన్నిరోజుల అనంతరం అది ఒక ద్వీపానికి కొట్టుకుని మునిగిపోయింది. మిత్రులు ఈదుకుంటూ సురక్షితంగా ఒడ్డు చేరుకున్నారు.

ఆ ద్వీపమే ఆసులు, రాజులు, రాణీలు, జాకీలు నివసించే పేకముక్కల రాజ్యం.

## 3

మిత్రులు అడుగు పెట్టీ పెట్టడంతో ఆ రాజ్యంలోని శతాబ్దాల నాటి శాంతి భంగమైంది వీళ్లను చూసి ప్రజల మనస్సులు ఆలోచించడం మొదలెట్టాయి. హోరాహోరీగా చర్చలు ప్రారంభమయ్యాయి. ముఖ్యంగా మూడు సమస్యలు బయలుదేరాయి.

మొదటిది: ఈ కొత్తవాళ్లు ఏ కులానికి చెందినవాళ్లు? ఆసుల కులానికా, రాజుల రాణీల కులానికా, జాకీల కులానికా? లేక వీరు అధమవర్ణాలకు చెందినవారా? ఈ ప్రశ్నకు సమాధానం శాస్త్రాలన్నీ తిరగేసినా దొరకలేదు.

రెండోది: వీరు ఏ వంశంవారు? అంగమైన అరకుల, డైమన్ల వంశంవారా? నల్లని కళావరు, ఇస్పేటు వంశంవారా? ఎంతసేపు చర్చించినా ఈ ప్రశ్నకు జవాబు కుదరలేదు

మూడోది: వీరు ఏ ఆహారం తినాలి? ఎక్కడ నివసించాలి? ఎక్కడ పడుకోవాలి? వాళ్ల ముఖాలు నైరృతి దిక్కుగా ఉండాలా? లేక వాయవ్యంగా ఉండాలా? ఇదేదీ కాక ఈశాన్యంగా ఉంటే చాలా? పేకముక్కల రాజ్యంలో ఇంత జటిలమైన సమస్యలు, జవాబులు లేని ప్రశ్నలు ఎప్పుడూ రాలేదు.

కాని మన మిత్రులు ఈ ప్రశ్నలను పట్టించుకోలేదు. వాళ్లకు ఆకలి మిక్కుటంగా ఉంది. ఎలాగో ఓలాగు ఆహారం సంపాదించాలి. అందుచేత అవతల చర్చలు జరుగు

తుండగా, మిత్రులు దొరికిన ఆహారమల్లా తినేశారు. చేతికందిన పాత్రలో రుచిగల ప్రతిపానీయమూ తాగేశారు. అవతల దర్బారులో రాజులు కొలువు తీర్చి జాకీలతో సంప్రదిస్తున్నారు. ధర్మశాస్త్రవేత్తలైన ఆసులు ఒక కమిటీగా ఏర్పడి చర్చలు చేస్తున్నారు. ఇవతల కొత్తమిత్రులు ఆచారాల ప్రాకారాలుబద్దలుకొట్టిగలభా చేస్తున్నారు

నీచకులజులైన రెండు బంతులకీ, మూడు బంతులకీ కూడా కొత్తవాళ్ల ప్రవర్తన ఆశ్చర్యం, కోపం కలిగించింది మూడు బంతులు అన్నారు: "తమ్ములారా! చూశారా, వాళ్లెంత అసహ్యంగా ప్రవర్తిస్తున్నారో?" రెండు బంతులు సమాధానమిచ్చారు "బహుశా వాళ్లు మనకంటే తక్కువకులంవాళ్లై ఉండాలి"

కడుపారా భోజన మారగించి ముగ్గురు మిత్రులూ నగరంలో విహారానికి బయల్దేరారు.

రోడ్లమీద ఒకరివెనుక ఒకరుగా జనం నడుస్తున్నారు. ఏదో ఆలోచనలో ఉన్నట్టు గంభీరంగా ఉన్నాయి వారి ముఖాలు ఇదంతా వింతగా తోచి రాజకుమారుడు మిత్రుల బుజాలమీద చేతులువేసి విరగబడి నవ్వాడు.

ఆనవ్వు రాజవీధిగుండా ఆసుల పేటదాటి జాకీల ఇళ్లవెనుక నిశ్శబ్దంలో కలిసిపోయింది. ఎప్పుడూ వినని ఈ శబ్దంవిని ప్రజలు తల్లడిల్లిపోయారు.

కొత్వాలు కొడుకు, వర్తకుని కొడుకు తమచుట్టూ మనుష్యులను, వారి విచిత్రప్రవర్తనను చూసి భయపడ్డారు. రాజకుమారుడితో అన్నారు: "మిత్రమా! ఇదేదో భూత నగరంలాగా ఉంది. ఇక్కణ్ణించివెళ్లిపోదాం మనం."

కాని రాజకుమారు డన్నాడు: "వద్దు మనమేమీ భయపడనక్కర్లేదు. వీళ్లు మనుష్యులే కాని దయ్యాలుకారు. వీళ్ల సంగతేమిటో, అసలు వీళ్ళ శరీరాల్లో కాస్తయినా వెచ్చటినెత్తురు మిగిలి వుందో లేదో తేల్చుకోవాలి"

## 4

రోజులు గడుస్తున్నాయి. ద్వీపంలో జీవితం యథాప్రకారంగానే నడుస్తున్నది. కాని ముగ్గురు మిత్రులుమాత్రం పాత ఆచారాలను, ధర్మాలను అతిక్రమించి ఇష్టంవచ్చినట్టు సంచరిస్తున్నారు. కూర్చోవడం, నుంచోవడం, పక్కకు తిరగడం, వెల్లకిలా పడుకోడం అన్నిట్లోనూ ఆచార విరుద్ధంగానే ఉన్నారు. పైగా అలా చేస్తున్న ప్రజలను చూసి నవ్వుతున్నారు

ఒకరోజున అగ్రవర్ణులు మన మిత్రులవద్దకువచ్చి అడిగారు: "మీరు ఆచారాలను ఎందుకు పాటించడంలేదు?"

"అది మా ఇచ్ఛగనుక," అన్నారు మిత్రులు.

అగ్రవర్ణులు కనుబొమలు చిట్లించారు. తెల్లమొగాలేశారు. "ఎవరయ్యా ఈ ఇచ్ఛ? ఎప్పుడూ ఆయనపేరు వినలేదే!" అన్నారు వారు ఇచ్ఛ అంటే ఏమిటో వారి కర్థం [illegible] కాని మిత్రుల మాటలవల్ల వాళ్ళ మనస్సులు శతాబ్దాల నిద్రనుండి మెల్లిగా మేల్కొన నారంభించాయి

రాజకుమారుణ్ణి పదేపదే చూస్తున్నకొద్దీ వారికికొన్ని కొత్త విషయాలు తెలియసాగాయి. ఇన్నేళ్ళనుండి తాము నడుస్తున్న దిక్కుకేగాక, దానివెనుక దిక్కుకు కూడా తాము నడవవచ్చునని కనిపెట్టారు. అంతేగాక పేకలకు మరొక ప్రక్కకూడా వున్నదని కనిపెట్టారు. దాంతో ద్వీప జీవితంలో గొప్ప మార్పులు రాసాగాయి.

క్రమంగా మిత్రులు పేకముక్కల రాజ్యంలోని జనులకు ఇచ్ఛనుగూర్చిన రహస్యాలన్నీ ఉపదేశించారు జీవితం కేవలం ఆచారాల మయంకాదనీ, ఆ సంకెళ్ళను తమ ఇచ్ఛాప్రకారంగా తెంచివేయవచ్చుననీ ప్రజలకు తెలిసింది ఈ కొత్తజ్ఞానోదయంతో పేకముక్కల రాజ్యంలో కొత్త మార్పులు రాసాగినవి.

## 5

ఇంతవరకూ ఇస్పేటు, కళావరు, డైమన్, అరకు రాణీలు పట్టుపరదాల మరుగున శూన్యంలోకి చూస్తూనో, లేకపోతే కళ్ళు వాల్చి నేలకేసి చూస్తూనో ఒంటరిగా కాలం గడిపేవారు.

కాని హఠాత్తుగా వసంతకాలంలో ఒకరోజు మధ్యాహ్నం అరకు రాణీ మేడమీది తెర ఒత్తిగించి తుమ్మెద రెక్కల్లాంటి కనురెప్పలెత్తి రాజకుమారునివంక ఓర చూపు చూసింది

"అరె! తమాషాగా వుందే? అవన్నీ చిత్రకారులు వేసిన బొమ్మలేమో ననుకున్నాను. నిజంగా వాళ్ళు స్త్రీలేనన్నమాట," అన్నాడు రాజకుమారుడు. తన మిత్రుల్ని దగ్గిరికి పిలిచి ఇలా చెప్పాడు "మాశారా, ఈరాణివాసం స్త్రీలలో ఇదివరకెన్నడూ లేని కొత్త అందం చిగురించింది. ఇందాక అరకు రాణీ కలవరేకుల్లాంటి కళ్ళెత్తి ఓరచూపు విసిరింది కొత్తగా సృష్టించబడ్డ ప్రపంచంలో మొదటిసారిగా ఉషఃకాంతి కురిసినట్టనిపించింది నాకు"

మిత్రులు కొంటెనవ్వు నవ్వుతూ, "అల్లాగుటోయ్," అన్నారు

ఆరోజునుంచీ అరకురాణీ రాజకుమారుడిమీద ప్రేమతో చిక్కిపోవడం, పరధ్యానంగా ఉండడం మొదలెట్టింది. ఆమెకు అన్నహితవు పోయింది ఆచారాలు, ధర్మాలు అన్నీ మరిచిపోయింది ఆమె పూర్వాచార ప్రకారం న్యాయంగా జాకీపక్కన నుంచోవాలి ఒక పంక్తిలో కాని మతిమరుపువల్లనో ఏమో వచ్చివచ్చి రాజకుమారుని పక్కన నుంచుంటున్నది. జాకీకి 'ఏమిట్రా ఇదంతా' అని కంగారు పుట్టి, "రాణీ! నువ్వు పొరపాటు చేశావు," అన్నాడు బుంగమొహం వేసుకుని.

అసలే గులాబీ రేకుల్లాంటి రాణీగారి బుగ్గలు ఈమాటల్తో మరీ దొండపండులాగ అయ్యాయి పాపం అప్పుడు రాజకుమారుడే కలగజేసుకుని, "లేదు. ఆమెదేమీ తప్పులేదు. ఈరోజునుంచీ నేనే జాకీనవుతున్నాను," అని చెప్పాడు

అసలు విషయమేమిటంటే, ప్రతివాడూ అరకురాణీ పొరబాటును సవరించడానికి ప్రయత్నించడంలో, వాళ్ళే పొరపాట్లు చెయ్యడం ప్రారంభించారు. రాజులు ఆసుల్ని మోచేతుల్తో నెట్టివేస్తున్నారు, జాకీలు రాజులతో కలిసిపోయారు, పదులు తొమ్మిదులు అగ్రవర్ణాలవారి మాదిరిగా షోకు చేసుకోవడం సాగించారు. రెండు బంతులు, మూడుబంతులుకూడా నాలుగు, ఐదు బంతులకోసం ప్రత్యేకించిన చోట్లలోకి రావాలని ఎత్తు వేస్తున్నారు ఇంత గందరగోళం, అరాఒకం ఆరాజ్యంలో ఎన్నడూ లేదు

వందలకొలది ఏళ్లనుంచీ ఒకే మాదిరిగా, మార్పు, ఎదుగు బొదుగు ఏమీ లేకుండా ఉంటున్న పేకముక్కల రాజ్యంలోని ప్రజలముఖాలు, మనస్సులుకూడా తారుమారైపోయాయి ఒకడిముఖంలో ఏడుపు, ఇంకోడిముఖంలో నవ్వు మరొకడి మనస్సులో ప్రేమ, వేరొకడి మనస్సులో సందేహాలు అన్నీ బయలుదేరాయి. సంగీతం, నిట్టూర్పులు, కన్నీళ్ళు ఎక్కువయ్యాయి ఇదివరకు ఎన్ని వసంత ఋతువుల్లోనో కోకిలలు వృథాగా కూసేవి. కాని ఈసారి వసంతంలో కోకిల కూసేటప్పటికి, అందులో సంగీతం వున్నట్టు వాళ్ళు కనిపెట్టారు.

ప్రతివాడూ తన ముఖం ఎదటివాడి ముఖంకంటే బావుందో లేదో పరీక్ష చేస్తున్నాడు కళావరు ఆసు ఇస్పేటు రాజును చూసి "ఏం బావున్నాడు, కోతిమొహం వేసుకుని? నేనో? నేను వీధిలో పోతుంటే, దానిదుంపతెగ, అందరికళ్లూ నామీదేనాయెను!" అనుకున్నాడు. ఇస్పేటురాజు, "ఓరి వీడి గర్వం మండిపోను కళావరు ఆసు అస్తమానము అలా మెడ రిక్కించి చూస్తాడేం? రాణీలంతా తనకోసం పడిచస్తున్నారని వాడి వూహ. అసలు వాడి ముఖం—" అనుకుని తన ముఖం మళ్ళీ అద్దంలో చూసుకునేవాడు.

కాని రాణీల పరిస్థితి మరీ గొడవగా వుంది ఇరవైనాలుగు గంటలూ సింగారించుకోవడమే వారి పని. రాజ్యంలోని యువకులు ఏమిటో పిచ్చెత్తినట్టు తిరుగుతున్నారు చెట్ల నీడల్లో వాళ్ళు కూర్చునివుంటే కోకిలలు పైనుంచి కుహూ అని దీర్ఘాలు తీసేవి. దక్షిణపుగాలి అల్లరిపాటలు పాడుతూ, జుట్టు రేపుతూ, చెవుల్లో గుసగుసలు వినిపిస్తూ గోలచేసేది. చెట్లఆకులు సంతోషంతో నాట్యం చేసేవి

ఇదంతా ఆద్వీపంలో జబర్దస్తీగా తిరుగుతున్న ముగ్గురు మిత్రులపనే. వాళ్ళే ఆచారాల సంకెళ్లలో వున్న పేకముక్కల రాజ్యంలోకి కొత్త జీవితం ప్రవేశపెట్టారు.

## 6

కొత్తజీవితం వచ్చినా ఒక్కరి మనస్సుకీ సంతృప్తిలేదు ఏదోచెప్పలేని ఆందోళన, అశాంతి ప్రతివాడు ఏవో తీరని కోరికలతో గాలిమేడలో, ఇసుకకోటలో కడుతున్నాడు ఇదంలా రాజకుమా

(30-వ పేజీ చూడండి)

## తీరని బాధ

(8-వ పేజీ తరువాయి)

—ఒక వేళ తను ఆమె ఇంటికి వెళితే కనీసం పలుకరించనయినా పలుకరిస్తుందా? ఎందుకు పలుకరించదు?! ఒక వేళ ఆమె అలా పలుకరించనయినా పలుకరించక పోతే ఆమె వట్టి మూర్ఖురాలనే నిర్ధారణకు తను ఖచ్చితంగా రావచ్చు! అప్పుడలాంటి మూర్ఖుల స్నేహం వదలుకున్నా విచారించ వలసిన అవసరం ఉండదు

సాధ్యమయినంతవరకూ జట్లు లేకుండా ఆఊళ్ళోవున్న కొద్దిపాటికుండీ అన్యోన్యంగా, శాంతంతో కాలక్షేపం చేయాలని శీతమ్మ తలంపు కామాక్షమ్మ అనవసరంగా తనను అపార్థం చేసుకొని ఈర్ష్యాభావంతో ఉన్నందుకు ఎంతయినా బాధపడింది శీతమ్మ ఆఊళ్ళోగల అమ్మలక్కల కొద్దిమందిలోనే విభేదాలు చెలరేగడం శీతమ్మకు సుతరామూ ఇష్టంలేదు అంచేతే కామాక్షమ్మ ఇంటికి వెళ్లి ఆమెకు నచ్చచెప్పి, మళ్లీ ఆమె మనస్సుని సన్మార్గంలోకి త్రిప్పుదా మనుకుంది

-శీతమ్మ వెళ్లేసరికి, కామాక్షమ్మ కూతురికి అన్నం పెడుతూన్నది వెళుతూనే, "ఏం, కామాక్షమ్మగారూ, నిన్నా ఇవాళా రావడం మానేసేరు మీరు రాకపోడంచేత మాయిల్లు చిన్నబోయినట్లయింది" అంది శీతమ్మ

మర్యాద ప్రకారం-"రండి కూర్చోండి" అని, మళ్లీ "అబ్బే, ఏమీ లేదండీ! ఏవో పనులుండి రావడం మానీసేను" అని సమాధానమిచ్చి, కామాక్షమ్మ, శీతమ్మ వేపు తిరిగింది

"మీరు రాకపోటంచేత నిన్నా, ఇవాళా ఏమీ ఊసుపోలేదుసుమండీ!" అంది శీతమ్మ

"ఏం! రమణమ్మగారు ఉన్నారుగా" అంది కామాక్షమ్మ పైకుబుకుతున్న ఈర్ష్యను అణచుకుంటూ-

"మీతో ఊసుపోయినట్లు, ఆవిడతో ఎలా ఊసుపోతుంది చెప్పండి! మీతోపాటు వెంకాయమ్మగారుకూడా రావడం మానేసేరు!! ఎంచేతో తెలియడం లేదు"

"రోజూ తప్పనిసరిగా రావడానికి తీరుబాటుండొద్దూ? ఏవేవో పనులుంటాయి" అని వెంకాయమ్మ తరఫు సమాధానాన్నికూడా చెప్పేసింది కామాక్షమ్మ

"అలా అంటారు పనులని!. నిజానికి మీకున్న పనులేమిటి చెప్పండి మహా?! ముసలమ్మగారే అన్నీ చేసేస్తూ ఉంటారు కదా!" అని నిలవదీసి అడిగింది శీతమ్మ

"బాగానే ఉంది! మా యింటికే మీరు రోజూ వస్తూఉంటే తెలుస్తుంది అప్పుడు మీరెంత తప్పనిసరిగా హాజరవుతారో చూస్తాను" అంది కామాక్షమ్మ లేని నవ్వు తెచ్చుకుంటూ ఖచ్చితమయిన సమాధానం ఇచ్చినందుకు తనలో తానే మురిసిపోయింది

శీతమ్మగుండె టక్కున ఆగినట్లయింది! ఔను! ఆమె అన్నట్లు వాళ్లే ప్రతీరోజూ కాలక్షేపానికి వస్తున్నారుగానీ, తనెప్పుడయినా వాళ్ల ఇళ్లకు వెళ్లిందా? లేదే!-అయితే తను వాళ్లను మొదట్లో కోరుండి తనింటకి ప్రతీరోజూ కాలక్షేపానికి రమ్మన మని ఆహ్వానించిందా? ఊహుఁ!-పదేళ్ల క్రిందటినుంచీ, ఆవీధి వాళ్లంతా తమ గుమ్మంలో (ఆడలమ్మక్కలు మాత్రం) కలియడం ఆనవాయి అయింది అంతే! మరయితే అందులో తన తప్పేముంది? లేదే!!-

-శీతమ్మ కొంచెం తెలివయిన దవడంచేత ప్రస్తావన మార్చి "అయితే మీకు పనులుండి రావడం మానేసేరనడం సబబు! పోనీ, మీ పిల్ల అస్తమానం మా ఇంట్లోనే వుండి మా పిల్లతో ఆడుకుంటానికి వస్తూ ఉండేదికదా, నిన్నటినుండీ ఓమారయినా రావడం మానేసిందేం?"

కామాక్షమ్మ ఉక్కిరి బిక్కిరి అవవలసొచ్చింది ఆ ప్రశ్నకు జబాబేమని చెప్పడం?-అంతలా నిలవదీసి శీతమ్మ అడుగుతుందని కామాక్షమ్మ అనుకోలేదు శీతమ్మమీద ఆమెకో రకంగా చికాకూ కోపమూ కలిగినయ్!- మీపిల్ల మాయింటికి ఎందుకు రాలేదు?" అని ఎదురు ప్రశ్న వేసింది

-ఈప్రశ్నకూడా చిక్కు పరిస్థితినే ఏర్పరిచింది అయినా ఎలాగో సమర్థించేసింది శీతమ్మ-"రోజూ మీ పిల్లే మా ఇంటికొచ్చి ఆడకోడం అలవాటూను! ఉండుండి ఓనాటినుంచీ రావడం మానేస్తే" అని వాక్యం పూర్తిచేయక మునుపే-

-"ఎంచేత తోటిపిల్ల రాలేదో కనుక్కొనే అంగుకయినా మీపిల్లని పంపించక్కర లేదేమిటి?"

"సరి! సరి! బోధపడింది మాపిల్ల మీఇంటికే ఇకనుంచీ ఆడుకోడుకి రావాలనికదూ మీతాత్పర్యం!" అని శీతమ్మ కొంచెం హెచ్చుస్థాయిలో

"అయితే అక్కడికి మాపిల్లేనేమిటి మీ పిల్లకు చెలికత్తె అనుకుంటున్నారు మీ ఇంటికివచ్చి ఆడడానికి!"

"ఎందుకండీ వృధాగా అంత పెద్ద మాటలనేస్తున్నారు చెలికత్తె అంటే మీకర్థం తెలీనట్లుంది! పోనీలెండి, ఇకనుంచీ మాపిల్లనే మీఇంటికి పంపిస్తూ ఉంటాను. చక్కగా రత్నంలాగున్న మీపిల్లతో, మాపిల్ల ఆడుకుంటూ ఉంటే ఎంతో ముచ్చటగా ఉంటుందండీ నాకు!"

"ఏదో నాముందుగనక రత్నమనీ, గిత్నమనీ మాపిల్లను పొగుడుతున్నారు -"

"అయితే నామనసులో మరో ఉద్దేశ్యం ఉన్నాదనుకుంటున్నారా? - నిజంగా చెపుతున్నాను మాపిల్లకన్నా మీపిల్ల ఎంతో చక్కగా ఉంటుంది!"

"పోనీలెండి వెటకారానికేం?! అందచందాలు మాలాంటి సామాన్య కుటుంబాలకు ఎలావస్తాయి చెప్పండి?! అలంకరించుకోటానికి ఆభరణాలా ఏమయినానా?"

"కామాక్షమ్మాగారూ! మీరనవసరంగా చెప్పుడుమాటలు వినినన్నపార్థం చేసుకుంటున్నారు నామీద మీకు బాగా కోపంవచ్చినట్లుంది నావల్లతప్పంటే క్షమించండి!! మీరు రేపణ్ణుంచీ మళ్లీ అలవాటు ప్రకారం మధ్యాహ్నం వేళ మా ఇంటికి వస్తూ ఉంటారని నమ్ముతాను అటుపైని మీదయ! నాకు వేళయింది మళ్లీ వస్తా" అని శీతమ్మ లేచి నిలబడింది

"బాగానే ఉంది మధ్య మీమీ దెందుకు నాకు కోపం? క్షమించడానికి మీరు చేసిన తప్పేమిటి మహా!- అలు మీనీడను చూచి మీరే బెదురుతున్నారు తీరుబడి ఉంటే వస్తూ ఉంటానులెండి" అంది

కామాక్షమ్మ ఇక రాననే భావంవ్యక్తం అయేలా!

* * * *

## 3

కామాక్షమ్మ ఆ మర్నాటినుంచీ యథాప్రకారంగా వచ్చేస్తుందని శీతమ్మ అనుకుందిగానీ రాలేదు!/

కామాక్షమ్మ ఇంటిదగ్గర ఓ అమ్మలక్కల సంఘం తయారయింది వెంకాయమ్మ ఆమె మిత్రురాండ్రందరూ అక్కడ గుమిగూడడం మొదలుపెట్టేరు

తమ పూర్వపు సంఘంలో చీలిక లేర్పడి కొందరు వేరుపడి క్రొత్తగా మరోదగ్గర సమావేశమవుతున్నప్పటికీ, అట్టేవిచారించక ఇంకొందరు క్రొత్త మెంబర్లను ప్రోగుచేసి శీతమ్మ ఇంటిదగ్గర అనుదిన సమావేశాన్ని బలపరచడం మొదలెట్టింది రవణమ్మ!!

మొత్తానికా ఊళ్లో రెండు ముఠాలేర్పడ్డాయి!.

శీతమ్మనీ, రవణమ్మనీ ఆతక్కిన ముఠావాళ్లనూ ప్రతీరోజూ విమర్శించడం, ఆ శీతమ్మ కూతురు ఏమీ బాగుండదనీ, అందవికారమయినదనీ, కామాక్షమ్మ దగ్గరని ఆమె సంతృప్తి చెందేటట్లు ఇచ్చకం కొట్టడం - కామాక్షమ్మ ముఠావాళ్లకు అనుదిన కార్యక్రమాలలో ఒకటయింది!

-కామాక్షమ్మ మంచిదే అయినప్పటికీ వెంకాయమ్మవల్ల ఆమె చెడ్డదవుతున్నాదనీ, శీతమ్మకూతురందమయిన దన్నంత మాత్రంలో, మధ్య శీతమ్మను అసహ్యించుకొని కోపం తెచ్చుకోడం, కామాక్షమ్మ తెలివితక్కువతనానికి నిదర్శనమనీ,- ఆమె లోలోన ఎంత కుమిలి కుమిలి ఏడ్చినా శీతమ్మకూతురి అందం ఆమెకూతురికి రాదనీ-శీతమ్మకున్న పాటి విశాల హృదయం-జ్ఞానం-అనుభవం ఆమెకు లేవనీ-ఈరకంగా రవణమ్మముఠావాళ్లు, వాళ్లని విమర్శిస్తూ కాలక్షేపం చేసేవారు

నిజానికి శీతమ్మ, కామాక్షమ్మల కూతుళ్లిద్దరిలోనూ ఫలానాపిల్ల అందమయినదని నిర్ధారణచేసి చెప్పలేము ఇద్దరు పిల్లలూ ఒకరి కొకరు తీసి పోనట్టుంటారు అందుకే వచ్చిందా చిక్కుపరిస్థితి! కొందరిటూ కొందరటూ తమతమ అభిప్రాయాలను వెలిబుచ్చేరు వారివారి దృక్పథాలను ఆధారంగా చేసుకొని!!

అయితే కామాక్షమ్మ, శీతమ్మలలో మాత్రం ఓ భేదంఉంది!-శీతమ్మకూతురు బాగుంటుందనీ, శీతమ్మ మంచి తెలివయినదనీ ఎవరయినా అంటే, ఆమె హృదయంలో పాదగబడిఉన్న ఈర్ష్య అసూయలు భీకర రూపాన్ని దాల్చి వికృత నాట్యం చేసేవి! తన కూతురే అందమయినదనీ, తనే తెలివయినదనీ లోకులందరూ అనాలని ఆమెకోరిక! ఒక్క పైవిషయాలలోనే కాదు, ప్రతీవిషయంలోనూ ఆరకం మనస్తత్వంగల మనిషే ఆమె

-కానీ, శీతమ్మ మనస్తత్వం అలాంటిది కాదు లోకులు తనను పొగిడినా పొగడకపోయినా బాధపడేది కాదామె. భిన్నాభిప్రాయాలలో లోకులుంటారని ఆమెకు తెలుసు ఆత్మవిశ్వాసంగల మనిషి శీతమ్మ! తనకూతురు బాగులేదనీ-తను తెలివితక్కువదనీ కామాక్షమ్మముఠావాళ్లు అన్నా అంతగా నొచ్చుకొనేది కాదు శీతమ్మ

కామాక్షమ్మకు ఆత్మవిశ్వాసం లేదు ఆమె కెప్పుడూ స్వంత అభిప్రాయాలూ, ఉద్దేశ్యాలూ ఉండేవికావు ఎప్పుడూ ఒక్కరు చెప్పినది నమ్ముతూ ఒకరి అభిప్రాయాలపైననే ఆధారపడి ఉండేది అందుకే ఆమె ఎప్పుడూ బాధపడుతూ ఉండేది!

* * * *

## 4

ఓరోజున శీతమ్మకూతురి పుట్టినరోజు వచ్చింది ఆరోజున శీతమ్మ మరీ మరీ రమ్మనమని ఆహ్వానించడంచేత, వెళ్లడం తప్పనిసరయింది కామాక్షమ్మకు! మానేస్తే బాగుండునని మొదటనుకుందిగానీ అంతలా పిలచినప్పుడు వెళ్లడం మానేస్తే మధ్య లోకులేమని కూస్తారో అనే భయంచేత వెంకాయమ్మతో కలసి పేరంటానికి వెళ్లింది

అక్కడ ఆమె భరించలేని అవమానం పొందినట్లు తలంచుకుంది!

-అందరూ రావడం శీతమ్మకూతురిని ఎత్తుకొని ముద్దులాడి, మణిపూస అని కొందరూ, రత్నాలభరిణ అని కొందరూ, అందాలరాణీ అని కొందరూ, తిలోత్తమ అని కొందరూ, రంభఅని కొందరూ-రకరకాలుగా వర్ణించాలని లేకపోయినా కనీసం ఇచ్చకంకోసమయినా వర్ణించేయడం మొదలుపెట్టేరు గమ్మత్తేమిటీ అంటే అలా వర్ణించినవాళ్లలో కామాక్షమ్మ ముఠావాళ్లుకూడా ఉన్నారు

తన కూతురిని ఒక్కరూ ముద్దులాడక, అందంగా ఉన్నాదని పొగడకపోడంచేత అక్కడున్నవాళ్లందరి మీదా చాలా కోపంవచ్చింది కామాక్షమ్మకు కానీ ఒక్కర్తీ ఏంచెయ్యగలదు? దుఃఖం దిగమ్రింగుకొని కూర్చుంది-

శీతమ్మమాత్రము కామాక్షమ్మ కూతురిని ముద్దులాడి-"ఏం పాపలూ, మా ఇంటికి రావడం మానేసేవు?" అని అడిగింది

"మాఅమ్మ వెళ్లొద్దంది!" అని చటుక్కున చెప్పేసిందా అమాయకురాలు పాపలు

-అందరిమధ్యా భరించలేని అవమానం పొందినట్లు భావించుకుంది కామాక్షమ్మ

"ఏమిటే, ముండా! నే వెళ్లొద్దన్నానా?" అని అంటూ "చళ్"న పాపలు నడ్డిమీద కొట్టింది కామాక్షమ్మ బావురుమంటూ ఏడుపు మొదలెట్టిందా అమాయకురాలు!

"అదేమిటండీ చిన్నపిల్ల నలా కొట్టేసేరు!" అన్నారందరూ

"చూసేరా! అవాళ వానపడుతున్నప్పుడు వెళతాననంటే వెళ్లొద్దన్నాను అప్పటినుంచీ ఎప్పుడూ మీ ఇంటికి వెళ్లొద్దన్నాననుకొని రావడం మానేసిందికాబోలు! నాకేం తెలుసు! చూసేరా, ఎలా చెపుతున్నాదో!" అని ఎలానో సమర్థించబోయింది

-ఎంత సమర్థించుతున్నప్పటికీ రవణమ్మకు మాత్రం నవ్వు ఆగలేదు నవ్వేసింది!!

ఆ ముఠావాళ్లందరూ లోలోన నవ్వుకున్నారు

అవమానం సహించలేకపోయింది. తగిన ప్రత్యవమానం శీతమ్మకి చేయాలనుకుంది కామాక్షమ్మ-మరి మూడు మాసాలలోనే తన కూతురి పుట్టినరోజు కూడాను! ఆరోజున తన ముఠావాళ్లచే శీతమ్మ కూతురు బాగులేదని అనిపించి ఆమెను అవమానపరుచుదామనుకుంది ఏమయినా సరె తగిన ప్రతీకారం చేయాలనే తీర్మానానికి వచ్చిందామె!

కానీ, శీతమ్మ ఆమాత్రం చిన్నవిషయంకోసం ఎప్పుడూ బాధపడదు! కావలిస్తే ఆనాడు శీతమ్మకూడా అందరితోనూ కలసి ఆమెకూతురిని తెగవర్ణించేస్తుంది-అసలెవరయినా సరే ఆపరిస్థితిలో పేరంటానికని పిల్చిన తరువాత వాళ్లింటికెళ్లి వాళ్లపిల్ల ఒకవేళ బాగులేక పోయినప్పటికీ ఓమారు మర్యాదకోసమయినా వాళ్ల పిల్లను ఎత్తుకొని ముద్దులాడి అందంగా ఉందని వర్ణించేస్తారు!!

ఎలానూ శీతమ్మకూతురి పుట్టినదినం జరిగినట్లే, కామాక్షమ్మకూతురి పుట్టం దినంకూడా జరుగుతుంది కానీ తనలాగ శీతమ్మ నొచ్చుకొని అవమానం పొందినట్లు "ఫీ" లవదని కామాక్షమ్మకేం తెలుసు!!

*　　*　　*　　*

# 5

శీతమ్మను బాగా అవమాన పరుద్దామనీ,- నలుగురిమధ్యా ఆమె కూతురికన్నా తన కూతురే అందమయినదని 'ప్రూఫ్' చేద్దామనీ ఏన్నో కలలు కంది కామాక్షమ్మ కానీ కన్న కలలన్నీ కన్నీళ్లయి ఊరుకున్నాయి!

మాయదారి స్ఫోటకం! కామాక్షమ్మ కూతురి ఆకృతినే మార్చేసింది!!-పిల్ల పుట్టిన రోజునాడు కనీసం వాళ్ల మట్టుకు వాళ్లయినా తిండి తినకుండా గడచిపోయింది!

-"శీతమ్మగారి కూతురి అందాన్ని మించి తేజంతో ఎంతో అందంగా ఉండేదండీ! పాపం ఎలా అయిపోయిందో!" అని కొందరూ-

-"రంభా, ఊర్వసులు ఏమాత్రమూ అన్నట్లుండేదండీ! ఫ్చ్! ఎలా అయిపోయిందో!" అని కొందరూ

"నిజానికి ఇంత అందమయిన పిల్లను నేనెక్కడా చూడలేదండీ! శీతమ్మగారి కూతురు అందమయినదే అయినా, అడుసుకలుండడం చేత, మీపిల్లముందు తీసికట్టుగానే ఉండేది ఇంతికీ ఇంత అందముయిన పిల్ల భూలోకంలో ఉండడం భగవంతుడికి కూడా కిట్టలేదు కాబోలు!" అని కొంచెం వేదాంతాన్ని ఉపయోగిస్తూ కొందరూ-రకరకాలుగా తమతమ సానుభూతుల్ని తెలియజేసేరు

-ఆ పరిస్థితిలో లోకులు తన కూతురే శీతమ్మ కూతురికన్నా అందంగా ఉండేదన్నప్పుడు తను ఎలా సంతోషించడం? భయంకర అగ్నిజ్వాల మధ్య ఆమె హృదయం కొట్టుకోడం మొదలుపెట్టింది!

కన్నీటితో శీతమ్మకూడా సానుభూతిని తెలియజేసింది శీతమ్మ కూతురి వేపు చూసింది శరీరంమీద ఎక్కడా కాలీ లేకుండా అరంగుళం లోతు గాతలు పడి ఉన్న తనకూతురు వేపు చూచింది శీతమ్మ మీద పడి బావురుమని ఏడవడం తప్పా మరేమీ చేయలేకపోయింది కామాక్షమ్మ!

"పోనీ బ్రతికుంది మనకంతే చాలు!!" అని ఓదార్చింది శీతమ్మ

పాపం, తనకూతురు నిజంగా ఎంతో అందంగా ఉన్నన్నాళ్లూ, ఊళ్ళోపిల్లలందరికన్నా అందంగా లేదేమో అని ప్రతీ క్షణం బాధపడేది!! మరి ఇప్పుడు?? ఆమె జీవితాంతంవరకూ ఇక తీరనిబాధ అయింది



# "వారసులు ఎవరు?"

(20-వ పేజీ తరువాయి)

రంతా పోకపోతే గందా కుర్రోళ్లు మాటంటే యేంసాగుద్దిలెండి! లోకంతో పాటే వీళ్లూను" అంటూ గోపయ్య కాస్త పెద్దతరహా చూపించి మాట్లాడాడు

"నువ్వూరుకో పెద్దయ్యా!" అంటూ కసురుకున్నాడు వీరాసామి

"ఒరి పోనీండిరా! ఆళ్లంతా బాగానే వుంటే మద్దె మన కెందుకురా యీ కేచులాటలు?" అన్నాడు గోపయ్య సాచేతగా

"మన కెందుకంటా వేవిటి? యీ సావుకార్లందరికీ యెంత కడుపుబ్బుగా వుందనీ, నిన్న నీ వెంకయ్యగారేమన్నాడో అడుగు! నడివీధిలో నించుని అంత ఆగడంగా మాట్లాడ్డ మెందుకంట? ఆ కమ్‌జాతివాళ్లైవళ్ళో తేలాల్సిందే! వీళ్ళ మీద ఊళ్ళోనాలుగుమూలలా యాగీచేసిందెవరో! అసలు వీళ్ళ విషయం యెవళ్ళకావాలంట? యెవళ్ళ పన్లమీద వాళ్ళు పోతుంటే, పనిగట్టుకూచుని వీళ్ల యిళ్లల్లో యేం జరుగుతుందో అందరికీ జెప్పడానికి యెవళ్ళకి తీరికేడిసిందంట? ఆ గోడల్లోపల యేం జరుగుతుందో" అంటూ సూరయ్య సాభిప్రాయంగా చూసి వూరుకున్నాడు

"అదుగో, ఆ తలబిరుసు మాటలే వొద్దన్నా" అంటూ వెంకయ్య లేచి నుంచున్నాడు

"ఆఁ తలబిరుసు మా కెందుకుంటుంది గానీ " అని వీరాసామి అంటూండగానే యెవరో వ్యక్తి అక్కడికి వచ్చి తొరగా రమ్మంటున్నారని వెంకయ్యకు కబురు చెప్పాడు

వెంకయ్యతోబాటే అక్కడి సావుకార్లందరూ వెళ్లిపోయారు, వీళ్ళూ ఇవతలకు సాగారి వొచ్చేస్తూ యిలా మాట్లాడుకుంటున్నారు—

"ఎట్టా వుందో వొరేయ్!"

"మూడు రోజుల్నించీ మంచినీళ్లుగూడా సరిగా తాగడం లేదట్రా!"

"జబ్బేవిఁటన్నారో?"

"ఏవోఁ డాక్టర్లకూడా అంతు చిక్కడం లేదట!"

"అవ్వ్రా మరి - మాటలా? యెంతో పెద్ద సావుకార్లైతేమఁటుకు పరువుకి పరువూ పోయె, డబ్బుకి డబ్బూ వొదిలె!"

"మెల్లిగా అంటావేరా? కాస్తా, కూస్తా లక్ష రూపాయలు!!"

"మనవి పదితరాలు అలాగ్గా వెళ్లిపోతయ్ రా!"

"మొత్తానికి మోజస్సు, బాగా బుద్ధి జెప్పాడు సావుకారుకి"

"ఆఁ వాళ్లసలు పట్నంలో సదువుకుంటూనే అనుకున్నారట్రా తండ్రితో అన్నది కూడానట "నా యిష్టంవొచ్చినవాణ్ణిసదువైం తరవాత పెళ్లిజేసుకుంటానని!"

"మరి, యింత గొప్ప సమందం వొస్తే వొదులుకుంటాడా సావుకారు?-"

"మాటలా, లక్ష రూపాయలు కట్నం యివ్వడానిక్కూడా వెనకాళ్ళేదు!"

"సరేగానీ, యిరువాగులవాళ్లూ కిక్కురుమనకుండా వూరుకోడం జూస్తే యిచిత్రంగా వుందొరేయ్!"

"యిటువంటి యవహారం యెక్కడన్నా జూశామా అని!"

"ఊరుకోక ఉరేట్టుగుంటారా మావాఁ? యవహారాల్లో దిగి కోర్టుకెక్కితే, పరువెల్లపాటి దిబ్బలకాడ కూచోడమేనా మరేమన్నా వుందా?"

"ఇంతకీ, వాడిచేతి కెంతొచ్చిందో?"

"అది కావాలి వీడికి-"

"ఎంతేముంది, వాళ్లెట్టిన యాభైవేలు నగలతోనూ, నూకిక్కపోయుంటుంది"

"వోరి, వాళ్ల తర వెళ్లిపోతుంది లేరా!"

"వాళ్లేమన్నా తెలివితక్కువోళ్లా! ఇద్దరూ చదువుకున్నవాళ్లే ఏ లండనో పోయి పెద్ద సదువులు సదివొస్తారనుకుంటున్నారు "

"ఏమైనాగానీ, పెళ్ళయేదాకా కిక్కురుమనకుండా వుంది ఆడపిల్ల యెంత సాహసంజేసిందో చూశావా?"

"లేకపోతే యెవడి బాబుగోడి సొమ్మని లక్షరూపాయలు కట్నమిచ్చాడంట?"

"మన బోటోళ్లకి పచ్చిపేడకడి కావాలన్నా వూరికే తీసుకోనివ్వడు సంపాయించేప్పుడు అట్టా సంపాయిస్తారు ఒక్కసారి తెపక తెపక కొట్టుకుపోతుందంతే!"

"అవునుగా నోరేయి యీళ్లందరికీ మన మీద కసి యెందుకంట?"

"మన తూర్పువాళ్ళంతా యాకమై వాడిచేత యింత పనిజేయించారని-సెలకలకి వాడు యింటికి రావడమేవిఁటి, యీ సావుకారి కూతురు వాడితో ఉడాయించడమేమిటి, మద్ద మన తూర్పోళ్ల

## పేకముక్కల రాజ్యం

(35-వ పేజీ తరువాయి)

రుడు చూశాడు. ఎక్కడో పొరపాటు జరిగిందని, దాన్ని సవరించాలని అనుకున్నాడు ప్రజలందరినీ సమావేశం చేసి ఇలా చెప్పాడు"

"శంఖాలు, వేణువులు, డప్పులు, సన్నాయిలు అన్నీ వాయించండి. ఇవ్వాళ ఉత్సవం చెయ్యాలి. ఎందుకంటే నేటిరాత్రే అరకురాణీగారి స్వయంవరం"

సరే, పదులు తొమ్మిదులు వేణువులు, సన్నాయిలు వాయించారు ఎనిమిదులు ఏళ్ళు శంఖాలు, బాకాలు ఊదారు మిగతా పోడిముక్కలు డోళ్ళు, రంఢోళ్లు, డప్పులు వాయించారు.

ఈ సంగీత ధ్వనులతో, మంగళ వాద్యాలతో అశాంతి, ఆందోళన అన్నీ ఎగిరిపోయాయి. సంతోషం వెల్లివిరిసింది. ఎక్కడ చూసినా పాటలు, ఆటలు, నృత్యాలు, విందులు.

కాని అరకురాణీ మాత్రం తోటలో మల్లె పొదరింటిలో గులాబిపూలపాన్పుమీద కూర్చుని నిట్టూర్పులు విడుస్తోంది దూరంనుంచి వినవచ్చే ఉత్సవధ్వనులు ఆమె వినిపించుకోవడమే లేదు. కళ్ళు మూసుకుని తన ప్రియుణ్ణిగూర్చి కలలు కంటోంది కళ్ళు తెరవగానే ఎదురుగా రాజకుమారుడు కనిపించాడు. అతడు ఆమెకేసే రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. ఆమె సిగ్గుపడి రెండుచేతులతోనూ ముఖం కప్పుకుని పారిపోయింది.

ఆ రాత్రి కోటద్వారాలవద్ద రంగురంగుల బట్టలతో ముస్తాబైన యువకులు, యువతులు కేరింతలు కొడుతూ సమావేశమయ్యారు. దర్బారులో దేదీప్యమానమైన దీపతోరణాలు, పూలతోరణాలు అలంకరించబడ్డాయి మెల్లిగా పరదాల వెనుకనుంచి అరకురాణీ వచ్చింది. ఆమెగౌరవార్థం అంతా లేచి నుంచున్నారు. మల్లెపూల దండ చేతులో విలాసంగా పట్టుకుని ఒయ్యారంగా వచ్చి రాజకుమారుడి ముందు తలవంచుకు నిలిచింది. సిగ్గువల్ల ఆమె చేతులెత్తి దండ వెయ్యలేకపోయింది. కాని రాజకుమారుడే తలవంచి దండ స్వీకరించాడు. వెంటనే యువతీ యువకులందరూ హర్షధ్వానాలు చేశారు. ఆరోజున వారు చేసిన కోలాహల శబ్దం దూరాన సముద్రంలో పోయే ఓడల్లోని జనులకు కూడా వినిపించింది.

రాజకుమారుణ్ణి, అతని వధువును ప్రజలు పల్లకిలో ఎక్కించి రాజ్యమంతటా ఊరేగించారు. సింహాసన మెక్కించి తమ రాజ్యానికి రాజూ, రాణీ చేశారు.

కుమారుడి వివాహవార్తవిని దూరదేశంలో రోజులు లెక్కిస్తూ గడుపుతున్న రాజకుమారుని తల్లి పేకముక్కల ద్వీపానికి ఓడమీద బయల్దేరి వచ్చింది. కొడుకు బలవంతంమీద ఆమె అక్కడే ఉండిపోయింది.

ఆతరవాత రాజ్యంలో ప్రజలు నియమాలు, నిబంధనలు అన్నీ తోసివేసి తమ ఇచ్ఛానుసారంగా జీవించారు.



---

వాళ్లమీదబడి యాడవడ మేమిటి? ఉరిమి ఉరిమి మంగలంమీద బడ్డట్టు-"

"బాగా అన్నావ్ మామా! లేకపోతే యెవళ్లు లేరగా పడున్నారనీ, వీళ్ల నోటికొచ్చినట్టు కూస్తుంటే వినూరుకోడానికి?"

"అసలువాళ్లందరికీ వోహజం బలిసిందిలే వూరంతా మన బుజాలమీదెట్టుకున్నాం గదా అని"

"అట్లాగే, అనుకుంటారు, అనుకుంటారు యెవడో పుట్టుకొస్తాడు గెద్దలా తన్నుకుబోడానికి"

"అటువంటిపల్లే మనబోటోళ్లు చేస్తే వూరూ వాడా యాకంచేసేవోళ్లు యీ గెడ్డమీద కుక్కడు మంచినీళ్లైనా పుట్టనిచ్చేవోళ్లు గాదు"

"నీకు తెలవదులే బావాయ్! డబ్బునోళ్ళకి తెలివితేటలు యెర్రి తలలేస్తూ వుంటయ్‌లే!"

"మన కెందుకొచ్చిం దూరుకోండిరా! నిజం నిలకడమీదే తెలుద్దిగాని"

"నిజంగాక మనమంతా అబద్దాలు కూస్తున్నామంటావా పెద్దయ్యా! వో చెంప దేశమంతా పాకిపోతుంటే, మధ్య మనం నోళ్లు నొక్కుకోడం యెందుకంట? ఒక్కపూళ్ళో ఆ దిక్కున జరిగిన సంగతి యీ దిక్కున చెప్పకోరూ?"

"ఇంకా యీ ముతావోళ్లకి దడవాలంటాడు పెద్దయ్య, యెవడు దడుత్తాడు! యీసారిగినా అళ్లన్న మాటలన్నిటికీ తలూగించి ఊరుకున్నావో, తూరుపేపోళ్లని పాముతలకాయ చితగబోడిచినట్టు పొడుత్తారనుకో!"

"మనంవెందు కూరుకుంటాంరా పిచ్చోడా, యీసారి యెంకయ్య మనీధిలో కొచ్చి పేలాడా, మళ్లీ వెళ్లి సావుకారుతో జెప్పకోవాల్సిందే! ఏహేం"

అందరూ తలూకదార్సి యిళ్లకు జారుకున్నారు—

(ఇంకావుంది)



''దీదార్''లో అభినేత్రి నిమ్మి

# జీవితంలో సినిమా జీవితం

జలు సినిమాలు తెగచూస్తున్నారు యువకులలో సినిమా వేలంవెర్రి పెరిగిపోయింది ఎక్కడ చూసినా ప్రజల సంభాషణలో సినిమాచిత్రాల ప్రభావం కనిపిస్తూ ఉంటుంది, సినిమా పరిభాష వినిపిస్తూ ఉంటుంది అయినా జీవితానికి సినిమా జీవితం ఎడంగానే ఉంటున్నది ఇందువల్లనే సినిమాప్రభావం జీవితంమీద ఉన్నట్టుగా జీవితం ప్రభావం సినిమామీద ఉండటంలేదు ఇది ప్రజాస్వామిక లక్షణం కాదు, ఇతరత్రా వాంఛనీయమూ కాదు

"సినిమా జీవితం" అన్న పదంలో సినిమా చిత్రాల తాలూకు కథలూ, చిత్ర నిర్మాతలు, తారలు మొదలైనవారి జీవితాలూ కూడా చేర్చాలి ఎందుచేతనంటే జీవితమూ, కళాజీవితమూ కలిసేది అక్కడే

మనదేశం పరాధీనంగా ఉండి మన కళలు నిర్జీవంగా ఉన్న సమయంలో ఆ కళలు జీవితానికి ఎంతదూరంగా ఉండినదీ, కళాకారులు జీవితానికి ఎంత వెలిగా ఉండినదీ మనలో ఇప్పటికీ కొందరు ఎరుగుదురు విప్రవినోదులూ, పగటి భాగవతులూ, వేశ్యలూ, "కూచిపూడి" వారు సహితం సంఘానికి అల్లంత దూరానే ఉండేవారు నాటకాలు వచ్చిన కొత్తలోకూడా "వేషాలు వేసే" వారికి శిష్టులమధ్య ప్రవేశం ఉండేదికాదు ఇది కళాకారుడికీ సంఘానికీ మధ్య ఉండదగిన సాధారణ సంబంధం కాదన్నది మనం కొంత కాలంక్రితం నుంచీ గుర్తిస్తూ ఉన్నాం కళాకారులను ఆరాధించటం కూడా సంఘం నేర్చుకుటున్నది ఇవాళ మన సినిమా చిత్ర నిర్మాతలకూ, తారలకూ ఉన్న మర్యాద రాజకీయ నాయకులకు లేదు

అయినాకూడా జీవితానికీ సినిమా జీవితానికీ గల ఎడం పూడలేదు కాకపోతే వారు విశేషంగా ధనార్జన చేస్తున్నారు కనక వారు సాధారణ జీవితంతో ఎక్కువ సంబంధాలు పెట్టుకోకుండా నిశ్చింతగా జీవితాలు గడుపుతున్నారు ఈ జీవితాలలో ప్రజలను ఉత్తేజపరిచేది ఏమీ లేకపోయినా వీటినిగురించి తెలుసుకుని కృత్రిమానందం పొందుతున్నారు ప్రజలు సినిమా తారల చిరునామాలు సంపాదించటం, వారి నిత్య జీవితాలనుగురించి



'వినోదా వారి' 'స్త్రీ సాహసం'లో శాంత, అంజలీదేవి, సి ఎస్ ఆర్

తెలుసుకోవటం, వారి బొమ్మలు పత్రికలలో చూసి సంతోషించటం మొదలైనవి ప్రజలకొక వ్యసనమైపోయింది ఈ పరిస్థితి సాంఘిక వ్యవస్థకొక గీటురాయి

ఇతర దేశాలలోని కళాకారులు జీవితపు బాధ్యతలను గురించి నిర్లిప్తంగా ఉండలేరు గత ఫాసిస్టు వ్యతిరేక సంగ్రామంలో బ్రిటిషు, అమెరికన్ రచయితలూ, కళాకారులూ నటులూ, రష్యన్ కళాకారులూ రచయితలూ, నటులూ కూడా విజయానికిగాను తమ సర్వశక్తులనూ ధారపోశారు గురుదేవ్ టాగూర్ జపాను ఫాసిజాన్ని తీవ్రంగా నిరసించాడు ఈనాడు కూడా కొరియాయుద్ధం విషయమైతేనేమి మూడవ ప్రపంచయుద్ధం విషయమైతేనేమి, అణువు బాంబులను గురించి అయితేనేమి యుద్ధప్రయత్నాలను గురించి అయితేనేమి ప్రపంచ కళావేత్తలు తమ విస్పష్ట భావాలను ప్రకటిస్తూనే ఉన్నారు ఏ భావాలూ ప్రకటించకుండా వారికి జరగదా అన్న సమస్య రానేరాదు వాళ్లు కళాకారులుగా జీవితానికి ముందు నిలబడి ఉండటంచేత జీవిత సమస్యలను గురించి వారికి బాధ్యతకూడా ఉంటుంది

ఇంత పెద్ద సమస్యలనే తీసుకో అవసరం లేదు మామూలు పరిస్థితులలోకూడా, ముందుకు వచ్చిన దేశాలలోని కళాకారులు తమ కళాసౌధాల నాలుగు గోడలమధ్య జీవించటం సాధ్యంకాదు తాము ఏ కళనైతే వృత్తిగా పెట్టుకున్నారో ఆ కళ బాహ్య జీవితాన్ని ప్రతిబింబించకపోతే కళాకారుడికి ఆత్మసాఫల్యం లేదు హాలీవుడ్ రచయితలూ, నటులూ కూడా జీవితాన్ని గురించి అసత్య కల్పనలు చేసే చిత్రాలలో పాల్గొనమని తిరుగుబాటుచేసిన సమయాలున్నాయి అందులో రాజకీయాభిప్రాయాలే ఉండనవసరంలేదు జీవితంతో సన్నిహిత సంబంధం ఉన్న కళాకారుడు రాజకీయాల ప్రమేయం లేకుండానే కళారంగంలో అభ్యుదయ భావాలకొరకు పోరాడటం జరుగుతుంది

రష్యాలోని కళాకారులు కేవలం రాజకీయాలలోనే పాల్గొంటూ కళకూ జీవితానికీ, రాజకీయాలకూ అవినాభావ సంబంధం ఉన్నట్టు భావిస్తారు అక్కడి జీవితంలో ఏ పెద్ద సంఘటన తీసుకున్నా దానికి ఒక రాజకీయ స్వరూపం ఉండనే ఉంటుంది దాని వెనువెంటనే కళా స్వరూపాలుకూడా పుట్టుకొస్తాయి అదీకాక అనేకమంది రష్యను కళాకారులు ప్రజాప్రతినిధులుగా రాజ్యాంగంలో కూడా పాల్గొంటారు అక్కడి కళాకారుడు రాజకీయాలనుగాని, జీవితాన్నిగాని తృణీకరించి అచ్చగా కళనే అంటిపెట్టుకోవటం సాధ్యంకాదు ఇతర పెట్టుబడిదారీ ప్రజాస్వామిక దేశాల్లో కళాకారుడు రాజకీయాలకు ఎడంగా ఉండటం సాధ్యమవుతుందిగాని జీవితానికి ఎడంగా ఉండటం అంత సాధ్యంకాదు మన దేశంవంటి బడుగుదేశాల్లో మాత్రమే కళాకారుడు ఇటు రాజకీయాలకూ, అటు జీవితానికీ కూడా చెందకుండా అచ్చగా కళాప్రపంచంలో ఉండి ప్రజలను ఆకర్షించగలుగుతున్నాడు

బొంబాయిలో సినిమాతారలు అప్పుడప్పుడూ ప్రదర్శనా లివ్వటమూ, బయటికి రావటమూ, చందాలు వగైరా పోగుచేయటమూ కద్దు కాని ఇదంతా జీవితంలో పాల్గొనటం అనిపించుకోదు ఒకరిద్దరు బొంబాయి తారలను పృథ్వీరాజ్ కపూర్ లాంటి వారిని మినహాయిస్తే మిగిలినవారంతా పబ్లిసిటీకోసం బయటికి వచ్చేవారులాగా కనిపిస్తుంది కళాకారుడి కళా జీవితానికీ ప్రజాజీవితానికీ సంబంధం లేనప్పుడు కళాకారుడు ప్రజాజీవితంతో సంబంధాలు పెట్టుకున్నట్టయితే అవి కేవలం తెచ్చిపెట్టుకున్న సంబంధాలవుతాయి మన తెలుగు సినిమా రంగంలో అటువంటి కృత్రిమ సంబంధాలైనా కానరాకపోవటం చాలా శోచనీయం

ఈ లోపం వ్యక్తులలో లేదనీ, మన సినిమా కళలోనే ఉన్నదనీ నిస్సందేహంగా చెప్పవచ్చు అందుకనే మన సినిమానటులు కనీసం సినిమారంగంలో ప్రవేశించినాక అయినా జీవితానికి సన్నిహితంగా రాలేకపోవటం జరుగుతున్నది సినిమా కళ జీవితంతో అవినాభావసంబంధం గలదైతే ఇలా జరగదు ప్రత్యక్షంగా జరుగుతున్నదేమిటంటే, జీవితంతో అంతో ఇంతో సాంస్కృతిక సంబంధాలు కలవాడు సినిమా ప్రపంచంలో పడిపోయినట్టయితే ఆ సంబంధాలను కూడా పోగొట్టుకునే పరిస్థితి ఏర్పడిఉన్నది ఈ పరిస్థితిమీద ఇంతో అంతో తిరుగుబాటు చేసినవాడు కీర్తిశేషుడు గూడవల్లి రామబ్రహ్మం ఆయనకూడా డబ్బుకోసరం "మాయలోకం" తీయవలసివచ్చింది అటు తరువాత సినిమాకళను జీవితానికి సన్నిహితం చేయాలన్న ప్రయత్నం జరగలేదనే చెప్పవచ్చు ఈ ప్రయత్నం ఎంత త్వరగా జరిగితే సినిమాకళకూ జీవితానికీ కూడా అంత మంచిది ★



వర్మాఖలింసువారి 'సగాయ్'లో యాకూబ్, రెహానా, గోపీ

# తీర్చని ఋణం

(10-వ పేజీ తరువాయి)

ప్రసా ఈ బి ఎ ను చూసి ఉద్యోగం ఎవడిస్తాడు నాకు?

కుటుం అంతకంటె శక్తి లేనప్పుడు ఏం చేస్తాం?

ప్రసా సరిపెట్టుకోవా లంటావు

కుటుం సరిపెట్టుకోక ఏం చేస్తావో చెప్పు?

ప్రసా ఇంత ఆదుర్దాగా పెళ్లిచేసుకోవటం నా కేమాత్రమూ ఇష్టంలేదు (నిశ్చయంగా) పెళ్లిచేసుకోకపోతే ఏమాతుంది?

కుటుం అనసూయ పెళ్లికాదు దాని జీవితం నాశనమవుతుంది నీమూలంగా. (కోపంగా)

ప్రసా నా మూలంగా!

కుటుం అవును నీ మూలంగానే ఆలోచించు ఆడపిల్ల, అందులో తోబుట్టువు దాని జీవితం ఏమాతుందో ఆలోచించు? స్వార్థం కాదు ప్రధానం

ప్రసా పైగా ఇదొకటి స్వార్థం!!

కుటుం కాక మరేమిటి?

ప్రసా అవును నేను స్వార్థపరుడినే అటువంటివాడిని యాచించి ఏం లాభం?

## రెండో దృశ్యం

(గది బయట)

అనసూయ అన్నాయ్? (పిలుస్తుంది)

ప్రసా (కొంచెం దూరంనుంచి) ఎవరది?

అన నేనే నన్నాయ్!

ప్రసా నువ్వా? ఇక్కడున్నావేం? (ఆదుర్దాగా)

అన ఏం లేదన్నాయ్ చిరిచాపకోసం వచ్చాను, గది దగ్గరకు గదిలో మీరు మాట్లాడుతుంటేను

ప్రసా బయట నిలబడి వింటున్నావు అంతేగా?

అన ఇందులో నేను చేసిన తప్పేమిటన్నాయ్ క్రిందటి క్షణంవరకు కోపం తెచ్చుకోవద్దని పెద్దన్నయ్యను వారిస్తూనే ఉన్నావ్ మళ్లా నువ్వూ అదే పని చేస్తున్నావ్

ప్రసా మొత్తంమీద అందరూ ఉండవలసిన వాళ్లు! దొరికినంతుకు చెప్పాలి!!

అన (గద్గదంగా) నేనేం చేశానన్నాయ్?

ప్రసా అదుగో! మాట మాట్లాడితే ఏడుపు ఎప్పుడూ నెత్తిమీద ఉంటుంది నీళ్లకుండ—

అన అసలు విన్నట్లు నీకు తెలియనిచ్చేదాన్ని కాదన్నాయ్ నామూలంగా మీరేదో వివాదపడుతుంటే

ప్రసా మధ్య తీరుద్దామని వచ్చావు అంతేనా?

అన: ఆ మాత్రం శక్తి ఉంటే

ప్రసా: (అందుకొని) ఏనాడో బాగుపడేవాళ్ల మంటావ్

అన నా మూలంగా మీ రిద్దరూ పోట్లాడుకోవట మెందుకని చెపుదామని పిల్చాను అదీకాక

ప్రసా (కొంచెం శాంతంగా) ఇటువంటి విషయాలలో జోక్యం కలుగజేసుకోవద్దని ఇంతకుముందు ఎన్నిసార్లు చెప్పాను నీకు?

అన చెప్పావన్నాయ్ కాదనటం లేదు నేను కూడ పెద్దదాన్నయ్యాను కాబట్ట నా అభిప్రాయం కూడ వినటం మంచిది

ప్రసా సరేలే నేను నీ అభిప్రాయం విననన్నటం లేదుగా పెద్దన్నాయంత మొండివాడిని కాదులే

అన పెళ్లిచేసుకోవటం నీవు మానుకొంటేనే మంచిది (బాధపడుతూ)

ప్రసా ఏదో బాధపడుతున్నావ్! ఎందుకంత బాధపడతావ్?

అన కాదన్నాయ్ నా పెళ్లి మూలంగా నీ చదువు నాశనం కావటం బాగా ఉండదు ఆ విధంగా జరిగిన వివాహం కూడ

ప్రసా అనూ! అటువంటి మాటలెందుకు అనూ? ఆ బాధలు పడేవాళ్లం మే మున్నాముగా

అన ఏదోవిధంగా నువ్వు ఎమ్ ఎ పూర్తి చేయటం అన్నివిధాలా మంచిది

ప్రసా (ఛలోక్తిగా) మంచిదని ఎవరు చెప్పారు అనూ?

అన ఈలోపు ఏదైనా స్థిరపడితే నా పని పూర్తవుతుంది లేకపోతే అప్పుడే చూసుకోవచ్చు

ప్రసా అక్కర్లేదు అనూ!

అన కాదన్నాయ్. అసలు పెళ్లి చేసుకుంటే చదువు సాగదు కూడ

ప్రసా నా మంచి నేను చూసుకుంటాను. ఆ విషయం నాకు వదలిపెట్టుమొన్న వచ్చినవారి విషయంలో నీ అభిప్రాయం ఏమిటమ్మా!

అన అసలు నేనిప్పుడు పెళ్లి చేసుకోను

ప్రసా. అదుగో! మళ్లీ పెంకిపిల్లలా మొండిపట్టు పట్టకూడదు

అన (ప్రాధేయపూర్వకంగా) నువ్వు ఎమ్ ఎ పూర్తిచేయాలి ముందు తరువాతి మిగతా విషయాలు

ప్రసా అయితే ఇదంతా నాకోసమన్నమాట 'పెళ్లి నాకిష్టంలే' దనటం నాకోసమేగా?

అన నీకోస మేమిటి? మా అన్నాయ్ కోసం—

ప్రసా: నీ పెళ్లి మీ అన్నకు ఇష్టంగాబట్టి మా అనూ పెళ్లిచేసుకు తీరుతుంది

అనూ లేదన్నాయ్ (మెల్లగా)

ప్రసా సరే, నీ ఇష్టం చెల్లాయ్. (ఎగతాళిగా)

## మూడో దృశ్యం

(గదిలో)

ప్రసా ఏమిటీ గందరగోళమంతా? (చికాకుగా)

(ఒక్క క్షణంసేపు నిశ్శబ్దం)

ప్రసా ప్రసూ! (మరికొంచెం పెద్దగా కేక) ప్రసూ!

ప్రసన్నకుమారి: ఆ. వస్తున్నానండి (దూరంనుంచి)

ప్రసా ఏమి టదంతా?

ప్రస ఇంత ప్రొద్దుబోయేవరకు ఏం చేస్తున్నారండి? ఎంతసేపయింది వచ్చి?

ప్రసా: పెగా ఇదొకటా నేను వచ్చి ఎంతసే పైతే నేం గాని, తోడికోడళ్ళ పోట్లాటమాత్రం తెగలేదు

ప్రస. పోట్లాట కాదండీ (శాంతంగా)

ప్రసా మ రేమిటి? కొట్లాటా? పది నిముషా లయింది నేను వచ్చి మీపోట్లాట మాత్రం పూర్తికాలేదు

ప్రస: మామూలుగా మాట్లాడినా మీకు పోట్లాటగానే ఉంటుంది

ప్రసా నాకు ఉండటంమాట అటుంచి, అస లెందుకు వచ్చింది మీ కీ పోట్లాట?

ప్రస పోట్లాట కాదండీ

ప్రసా ఆ పోనీ, పోట్లాటకాదు తోడెకోడళ్ల సరసా లనుకుందాం

ప్రస కొంచెం మెల్లగా మాట్లాడండి (అనునయంగా)

ప్రసా ఇదేం దొంగతనం కాదుగా, మెల్లగా మాట్లాడటానికి

ప్రస గోరంత విషయాన్ని కొండంత చేస్తారు మీరుమరీ

ప్రసా ఇన్ని నీతులు చెప్పావుకాని అసలు విషయాన్ని మాత్రం బయటకు రానీయవు తెలివంటే అలా ఉండాలి

ప్రస (శాంతంగా) మీ అన్నయ్య గారమ్మాయి నెత్తుకొని అన్నం పెట్ట బోయాను రెండుమూడు ముద్దలు తిన్న తరువాత కొలమారింది దానిమీద

ప్రసా ఆమె కారాలు మిరియాలు నూరి ఉంటుంది నువ్వంతకంటె ముందే ప్రారంభించిఉంటావు

ప్రస: మీరు వింటూనే ఉన్నానంటి రిగా నేనేంచేశానో చెప్పండి? (ప్రాథే యపూర్వకంగా)

ప్రసా మనం పరాధీనులమని ఎన్ని సార్లు చెప్పాను నీకు? ఇతరుల దయ మీద బ్రతికేవాళ్ళు ఏంచేసినా తప్పుగానే పరిణమిస్తుందని ఎన్నాళ్లనుంచి చెపుతున్నాను?

ప్రస! హుష్! ఆమె వస్తున్నట్లున్నది

ప్రసా' వస్తే మనకేం చెప్పు? నిజం మాట్లాడటానికి కూడ ఇంత భయపడవలసి వస్తే

ప్రస ఏం చేస్తాం చెప్పండీ!

ప్రసా నిజం మంచిమాటన్నావ్ ఏం చేస్తాం?

ప్రస (బాధగా) నేనన్న ప్రతి మాటకూ అలా అపార్థం చేసుకుంటా రేమండీ?

ప్రసా ఒక్క నీ మాటే కాదు ప్రసూ! నేను ప్రపంచాన్నే అపార్థం చేసుకుంటున్నానేమో ననిపిస్తుంది ఒక్కొక్కపుడు

ప్రస అదుగో! నే నన్న ప్రతి మాటకూ అంత బాధపడితే నే నసలు మాట్లాడనే మాట్లాడను

ప్రసా నువ్వు కూడ మాట్లాడటం మానుకో స్వంత అన్న మాట్లాడకుండా తప్పించుకు తిరుగుతుంటే ఏంచేశాను నేను? రేపు భార్య మాట్లాడకపోయినా అంతే అసలు నా ముఖం చూస్తేనే, మాట్లాడ కూడ దనిపిస్తుంది కాబోలు అందరకూ

ప్రస ఛా! అలా అనకండి

ప్రసా జరిగితే లేదుగాని, అంటే వచ్చిందా?

ప్రస పోనీలెండి ఆ విషయా లన్నీ తరువాత ఆలోచిద్దాం ముందర భోజనానికి లేవండి

ప్రసా ఆకలి లేదు (నిస్పృహతో)

ప్రస పగలు కూడ అన్నం తినలేదు గదండీ ఆక లయినంతవరకే తిందురు గాని లేవండి నేనుకూడ మధ్యాహ్నం భోజనం చేయలేదు

ప్రసా (వెంటనే, ఆశ్చర్యంగా) ఎందుకని?

ప్రస ఊరికే అన్నాను నే నెందుకుంటాను భోజనం చేయకుండా? అలా అంటే నన్నా మీరు లేచి భోజనం చేస్తారని

ప్రసా. (ఆదుర్దాగా) నిజం చెప్పు ప్రసూ మధ్యాహ్నం అన్నం తిన్నావా? లేదా?

ప్రస. (లేని నవ్వు తెచ్చుకొని) నేనంటే మీకు నమ్మకం లేదూ? మీరు తినక పోయినా నేనుమాత్రం హాయిగా తిన్నాను

ప్రసా అబద్ధం శుద్ధ అబద్ధం

ప్రస నా మాట నమ్మి మీరు కూడ తినండి ఈ పూట మీరు తినకపోతే నేను కూడ తినను

ప్రసా మనం తినకపోయినా మన కోసం ఏడ్చేవా డెవడు?

ప్రస అనవసరంగా అంత బాధపడటం బాగా లేదు

ప్రసా ఏమిలేదు నిజం నెలరోజుల నుంచి అదేపనిగా తిరుగుతున్నా ఉద్యోగం లేదు నెలకు అరవైరూపాయలు చాలు అసలు ఉద్యోగం ఏదీ?

ప్రస. మీరే అంత నిరుత్సాహపడితే ఎలా చెప్పండీ? (లేని సంతోషం తెచ్చుకొని) నేను చెప్పాను చూడండి రేపు మీకు ఉద్యోగం దొరికి తీరుతుంది

ప్రసా: ఏం ఉద్యోగం? అన్ని బజార్లూ మరింత ఎక్కువగా తిరిగే ఉద్యోగమా?

ప్రస. అలా అధైర్యపడకండి నా మాట నమ్మండి. రేపు మీకు ఉద్యోగం దొరికి తీరుతుంది

ప్రసా. దొరకదు ఆ యోగ్యత లేదు నాకు

ప్రస. మీరే అంత అధైర్యపడితే నా సంగతేమిటి చెప్పండి?

ప్రసా. నిజమే నేను నీకు ధైర్యం చెప్పవలసిందిపోయి, నీచేత నేను చెప్పించుకుంటున్నాను నీచుడిని

ప్రస ఇటువంటి మా ట లంటారని తెలిస్తే నే నామాట అనేదాన్నే కాదు

ప్రసా పిచ్చిదానా! ఎవరన్నా అనాలా వేరే? కనుపించటం లేదూ; ప్రత్యక్షంగా?

ప్రస పొరబాటున నోరు జారిందా మాట ఇంకెప్పుడూ అనను

ప్రసా ఉన్నమాట అనటానికి భయపడకూడదు ప్రసూ

ప్రస నే నింకెప్పుడూ అటువంటి మాట అనను అనన న్నానుగా!

ప్రసా నువ్వు అన్నా అనక పోయినా అదంతే

ప్రస ఏది? ఇటు చూడండి నామాట వినండి కొస్త విషయానికి మీరంతగా బాధపడటం నాకేమీ బాగా లేదు

ప్రసా ఉద్యోగం దొరుకుతుందా ప్రసూ? (ఆశగా)

ప్రస తప్పక దొరుకుతుంది ఎవడి కోసం

ప్రసా (అందుకొని) దొరకగు నెల రోజులనుంచి తిరుగుతుంటే దొరకని ఉద్యోగం రేపు దొరుకుతుందా? దొరకదు

ప్రస నేను దొరుకుతుందంటున్నానుగా! నామాట విని లేచి రండి అన్నం తిందురు గాని తరువాత ఆలోచించుకో వచ్చు ఇవన్నీ

ప్రసా ఆకలిగా లేదు

ప్రస పోనీ అయినంతవరకే.

ప్రసా ఆక లవటంలేదు ఎలా అవుతుందీ? అన్నా చెల్లెలు చేసిన పనికే కడుపు నిండిపోయింది

ప్రస చిన్న చిన్న విషయాలకు బాధపడటం మీకు సహజం

ప్రసా నేను బాధపడి ఊరుకుంటూన్నాను మరొకడయితే ఏం చేసేవాడో?

ప్రస: ఊ ఏం చేసేవా ఏమిటి?

ప్రసా మూడు నిముషాలు ముక్కు మూసుకుంటే సరి

ప్రస: ఛా! కడుపు తరుక్కుపోయే మాటలు. (అంటూ నోరు మూస్తుంది)

ప్రసా నిజం ప్రసూ! ప్రతిఫలం ఆశించి చెయ్యలేదీ పని నేను.

ప్రస పోనీలెండి భోజనానికి లెండి తరువాత మాట్లాడుకుందాం

ప్రసా: ఒకప్పుడు ఎంత ఆప్యాయంగా మాట్లాడింది అనసూయ

ప్రస: నిజానికి మీ చెల్లి చాల మంచిది

ప్రసా అవును మంచిదే అందుకనే స్వసుఖాన్ని తనకోసం వెచ్చించిన అన్నని మర్చిపోయింది

ప్రస పోనీలెండి మనకుమాత్రం ఆమె ఏం సహాయం చేస్తుంది చెప్పండి కొత్త కాపురం

ప్రసా అవును కొత్తకాపురం గనుకనే మర్చిపోయింది పాతకాపురం గనుక అన్న కూడ మర్చిపోయాడు

ప్రస ఏం మర్చిపోయాడు చెప్పండి?

ప్రసా ఏమీ మర్చిపోలేదు. చెల్లెలి పెళ్లిచెయ్యలేని పరిస్థితులలో ప్రసాద్ వెధవ చేసిన పని తప్ప అన్నీ జ్ఞాపకం ఉన్నయ్

ప్రస పోనీలెండి

ప్రసా పోనియ్యక నేనేం పట్టుకోవటం లేదు

ప్రస పెద్దవాళ్ళకి సాయపడటం చిన్నవాళ్ల విధి

ప్రసా చిన్నవాళ్ళకి సాయపడటం పెద్దవాళ్ళ విధి కాదూ?

ప్రస అబ్బ మీకు సమాధానం చెప్పటం ఎలా ఇక నామాట విని భోజనానికి లేవండి

ప్రసా. నిన్ను పెళ్లిచేసుకున్నప్పట నా పరిస్థితి నీకు తెలియదు

ప్రస అన్నీ తెలుసు.

ప్రసా ఎలా?

ప్రస మీ చెల్లి చెప్పింది ఒకనాడు

ప్రసా దానికి తెలుసు అంతా తెలుసు తెలిసే చేస్తున్నది

ప్రస పాపం! ఆ అమ్మాయిని అనకండి ఆ అమ్మాయేం చేస్తుంది?

ప్రసా నేను ఒక్కమాట అంటాను కోపం రాదుగదా

ప్రస రాదుగా. చెప్పండి త్వరగా భోంచేద్దురుగాని

ప్రసా నిన్ను నేను పెళ్లిచేసుకోవటం పరిస్థితుల ఒత్తిడివల్ల చెల్లెలి పెళ్ళికోసం, అన్న మర్యాదకోసం పైగా

ప్రస: పోనీలెండి ఎందుకిప్పుడవన్నీ.

ప్రసా ఎందుకూ లేదు ఊరికే కనీసం ఖాళీ పొట్టనిండదు కూడ.

## నాలుగో దృశ్యం

(స్టేషన్ ప్లాట్‌ఫారం)

ప్రస ఇప్పటికైనా నామాట వినండి

ప్రసా ఇంతకంటె ఏం చేయమంటావు ప్రసన్నా? (బాధపడుతూ)

ప్రస ఇకమీదట ఇంట్లో నోరుకదపను.

ప్రసా ఆ ఇంట్లో మనని ఉండనివ్వరు (నిస్పృహగా) ఎలా ఉండనిస్తారు?

ప్రస మీరు 'ఊ' అనండి ఏదో విధంగా ఉంచేది నేనుగా

ప్రసా వద్దు ఇకమీదట మనం ఆ ఇంట్లో ఉంటే మన మర్యాద దక్కదు.

ప్రస. మీరంగీకరిస్తే నేనుండగలను

ప్రసా ఇంకా నయం త్వరలోనే మేల్కొన్నాము

ప్రస (ఆదుర్దాగా) ఏం?

ప్రసా మరో పదిరోజులకి మనను వెళ్లగొట్టేవాళ్ళే వెళ్ళగొడతారు మనంతట మనమే ముందు బయటకు రావటం ఎంత మర్యాదగా ఉన్నదో చూడు

ప్రస వాళ్ళు పరాయివాళ్ళు కాదు గదండీ, అమర్యాదచేస్తే మనం సిగ్గుపడటానికి

ప్రసా పరాయివాళ్లేమిటి? తనవాళ్లేమిటి? డబ్బు (ఆలోచితంగా) డబ్బుంటే మన కందరూ ఆప్తులే.

ప్రస ప్రతి చిన్న విషయాన్ని మనస్సులో పెట్టుకొని ఇంతగా అమిత బాధపడటం

ప్రసా (అందుకొని, ఆలోచితంగా) ఉద్యోగం రాదు యుద్ధపు రోజులైనా బాగుండేది

ప్రస (గద్గదంగా) ఏమిటండీ ఆ మాటలు?

ప్రసా నాకు ఉద్యోగం రాదు ఏం చదివానని, నాకేం తెలుసని ఉద్యోగం ఇస్తాడు ఎవడైనా?

ప్రస మీరు చెప్పినట్లే చేస్తున్నా అంత బాధపడటం బాగా లేదు

ప్రసా వెళ్లు పుట్టింటికి వెళ్లు ప్రసన్నా ఉద్యోగం రాగానే వచ్చి తీసుకుపోతాను

ప్రస అసలు మిమ్మల్నీ స్థితిలో విడిచి వెళ్లటానికి నాకు మనస్కరించటం లేదు. నాతో కూడ రారాదూ?

ప్రసా: ఎక్కడికి?

ప్రస ఎందుకంత కంగారు పడతారు?

ప్రసా చేతగాక నిన్ను పుట్టింటికి పంపటం గాక నేనుగూడ రానా నీతో

ప్రస: రాకుండా ఎక్కడికి పోతారు మరి?

ప్రసా. ఎవడో ఒక స్నేహితుడింటికి పోతాను

ప్రస: నామాట విని నాతో రండి

ప్రసా రాలేను రాను. ఉద్యోగం దొరికిననాడు వస్తా

ప్రస అప్పుడే రావాలని ఎవరన్నారు?

ప్రసా భార్యను పోషించలేనివాడు బ్రతకటం దండుగ చిల్లిగవ్వ కూడ సంపాదించలేని నాలాటివాడసలు పెళ్లిచేసుకోవటమే శుద్ధ దండుగ

[ఇంతలో ప్లాటుఫారంమీదికి రైలు వచ్చి ఆగిన చప్పుడు]

ప్రసా అదుగో? బండివచ్చింది. జాగ్రత్తగా ఇల్లు చేరుకో.

ప్రస మరి మీరో?

ప్రసా నా విషయం తరువాత ఆలోచిద్దాం ముందర నువ్వు బండిలో కూర్చో.

ప్రసా అసలు సంగతి మర్చిపోయాం. టికెట్ తెచ్చిపెట్టరూ?

ప్రసా (మెల్లిగా, గద్గదస్వరంతో, ఎంతో బాధపడుతూ) జేబులో చిల్లిగవ్వ కూడ లేదు

ప్రస: ఎలా మరి ఇక? ముందన్నా చెప్పారు కాదు

ప్రసా నాకే తెలియదు ఏంచేయాలో!

ప్రస మరి టైమయి పోతోంది

ప్రసా ఏంచేస్తాం గనుక? ఇలా మన కళ్లముందు, మన కందరుండా ఎన్నిరైళ్లు సాగిపోతాయో?

ప్రస అదుగో సిగ్నల్ కూడ ఇచ్చారు.

ప్రసా ఏంచేయమంటావ్ నన్ను?

ప్రస (ఆదుర్దాగా) బండి కదలుతోంది

ప్రసా ప్రక్కను నుంచో నువ్వు ఎక్కలేవు ఈబండి

ప్రస అబ్బ! ఏంచేయాలి మనం ఇప్పుడు?

ప్రసా ఆలోచించటం అనవసరం. రాపోదాం ఇలా ఆలోచిస్తే కొన్నాళ్లకు మన ఆలోచనాశక్తే నశిస్తుంది

★

## డబ్బు! డబ్బు!! డబ్బు!!!

(17 వ పేజీ తరువాయి)

బాగా దిగజారింది రాత్రి జరిగిన సంఘటనలన్నీ ఒకటొకటే జ్ఞాపకం వచ్చేయి రాత్రి తను కొట్టినా, భార్య తనయెడల ఎంతో సహనం చూపిన సంగతి మనసుకు

తట్టింది తనే ఎంతో నీచంగా ప్రవర్తించేడు ఆమెను సుఖపెట్టేది లేకపోయినా రోజూ ఆమెను బాధపెట్టడానికి సంకోచించడం లేదు, తల్చుకుంటూన్న కొద్దీ తన నీచ ప్రవర్తన తనకే వెగటనిపిస్తూంది

వీరాస్వామి రెండుచేతుల్లోనూ ముఖం దాచుకుని చాలాసేపు ఏడ్చాడు

కొద్దిరోజులనుండీ వీరాస్వామికి త్రాగుడు బాగా అలవాటైపోయింది మొదట్లో మనశ్శాంతికోసం త్రాగడం నేర్చుకున్నాడు కాని యిప్పుడది అతన్ని బాగా లొంగతీసేసుకుంది ఇంతకీ చెప్పవలసిందేమంటే పూర్వం ఉండే మనశ్శాంతిని కూడా యిప్పుడు కోల్పోయాడు త్రాగుడు మత్తులో ఉద్యోగధర్మాన్ని సరిగా నిర్వర్తించలేకపోవడంవల్ల అధికారులతనికి ఉద్యోగంనుండి ఉద్వాసనచెప్పేరు

వీరాస్వామి ఉద్యోగం పోయినందుకు విచారించలేదు అతనిదగ్గర కావలసినంత ధనముంది! అయితే దాన్ని తనకూ, తన కుటుంబానికీ ఉపయోగపడేలా చేసుకుందుకు కొంతకాలం పడుతుంది ఈలోగా కొంచం అవస్థపడక తప్పదు ఆ ధైర్యంతోనే వీరాస్వామి యింట్లోఉన్న సామాన్లు ఒకటొకటే అమ్మడం మొదలుపెట్టేడు కొద్దికాలం ఓపికపడితే కావలసినవన్నీ మళ్లా కొనుక్కోవచ్చునని అతని ధైర్యం అతనిదగ్గర చాలా డబ్బువుంది !!

*   *   *   *

సామాన్లన్నీ ఒకటొకటే యిల్లు దాటుతున్నాయి ఇల్లు రోజురోజుకూ శ్రీరామరక్ష అవుతూంది దినం గడవడమే కష్టంగావుంది శాంతమ్మ ఎంత గుట్టుగా నిర్వహించుకు వస్తూన్నా జరిగే పరిస్థితులు దాటిపోతున్నాయి అయితేమాత్రం వీరాస్వామికేం భయం? అతను యిరవై వేల రూపాయల కధికారి!

ఈ సమయంలో దేవుడు వీరాస్వామికి మరొక పరీక్ష కల్పించేడు వారంరోజుల నుండీ రెండోపిల్ల చిట్టికి విపరీతంగా జ్వరం కాస్తూంది పన్నిపాతలకు జాలు పొడచూపాయి పిల్లను క్రిందపెటడం మీద పెట్టడంవరకూ వచ్చింది, పరిస్థితి ఇంకో ఎటు మాసినా చీకటే కూతురు బ్రతకాలని శాంతమ్మ వెయ్యిదేవుళ్లకు మొక్కుకుంటూంది పిల్లకి వైద్యం చేయించడానికింట్లో ఒక్కదమ్మిడీకూడా లేదు శాంతమ్మవంటిమీది బంగారంకూడా ఏనాడో కరిగిపోయి వాళ్ల పొట్టల్లో యిమిడిపోయింది ఇంక అమ్మడానికి చిల్లి చెంబు కూడా మిగల్లేదు ఆవిషయం శాంతమ్మకు బాగా తెలుసు అయినా,

'పిల్లకి మందు వేయించండీ ఎవరిచేతనైనా' అని భర్తకాళ్లమీద పడిపోయింది పెనుగాలికి కంపించే లేత కొమ్మలాగా ఆ మాతృహృదయం కూతురుపరిస్థితికి తల్లడిల్లి పోయింది

చిట్టి బాధతో జాలిగా ఒక్క కేక పెట్టింది వీరాస్వామి వెర్రి ఆవేశంతో లేచాడు అవసరానికి అక్కరకురాని ధనం ఉండేం, లేకేం? ఏమయితే అయింది, దాచిన డబ్బు తీసుకొచ్చి పిల్లకు మందు వేయించాలి అనుకున్నాడు

తను డబ్బుదాచిన యింటివైపు త్వరత్వరగా నడుస్తున్నాడు వీరాస్వామి ఆకాశంలో మబ్బు తునకలు చెలరేగుతున్నై అతను గమ్యస్థానం చేరేసరికి కొద్దిగా చినుకులు పడ్డం ప్రారంభించింది ఇప్పుడతనొక స్థిరనిశ్చయంతో ఉన్నాడు ఏమీ చలించడం లేదు ఒక్క అంగలో గుమ్మమెక్కి తలుపులు తెరిచేడు గునపం తీసుకుని త్వరత్వరగా గదిలో మూలను త్రవ్వి డబ్బు దాచిన పెట్టెను పైకితీశాడు లోపల ఉన్న డబ్బుతీసి ఒక్కొక్క కాగితమే పరీక్షించి లెక్కచూస్తున్నాడు డబ్బు చూచేసరికి అతని ఊహాలు మళ్ళీ మరో ప్రపంచంలోసంచరించడంప్రారంభించేయి

'ఏం, వీరాస్వామీ! దొంగ సొమ్మే మిటి, ఇక్కడ పాతిపెట్టేవు?' వెనకనించున్న నరసయ్య వికటంగా నవ్వేడు వీరాస్వామికి గతించిన విషయాలు - తనకు పర్సు దొరకడం, దినపత్రికల్లో ప్రకటనలూ, సొమ్ము దొరకినదగ్గరనుండీ తన అవస్థా - మస్తిష్కంలో మారుమూలదాగిన జ్ఞాపకాలన్నీ విజృంభించి అతని బుర్రలో ఒకసారి గిర్రున తిరిగాయి వీరాస్వామి వాస్తవిక ప్రపంచంలోకి వచ్చాడు మళ్ళీ అతని బుద్ధి నిశితంగా పనిచెయ్యడం మొదలుపెట్టింది తను గదిలోకి వచ్చిన తరువాత సంభ్రమంలో తలుపులు వెయ్యడం మరిచిపోయాడు - యిప్పుడు నరసయ్య కళ్ళపడిపోయాడు డబ్బు మాసి అప్పుడే నరసయ్య విషం కక్కుతున్నాడు కూడా వాడేదో ప్రమదం తీసుకొస్తాడనడంలో సందేహమేమీ లేదు వీరాస్వామి మెదడు చాలా తొందరగా పనిచేస్తూంది ఏనుగుమీదకు లంఘించే కొదమసింగంలాగా వీరాస్వామి నరసయ్యమీదకు ఉరికాడు చేతిలోఉన్న గునపంతో నరసయ్య బుర్రమీద ఒక్క పెట్టు పెట్టాడు 'అబ్బా!' అని నరసయ్య నేల కొరిగిపోయాడు బయట ఆకాశం ప్రళయభీకరంగా ఉరుముతూంది

వీరాస్వామిఆలోచనలు యింటివైపు పరుగులు తీస్తున్నాయ్ తనింటికి వెళ్ళేసరికి [illegible] ముఖాన పుష్కలంగా డబ్బు కొట్టి చిట్టికి మంచి మందు వేయించాలి తరువాత తను పట్టుబడ్డా బాధలేదు ముందా డబ్బు చిట్టినైనా కాపాడగలుగుతే చాలు సొమ్ము చేత్తో పట్టుకుని వీరాస్వామి వెనక్కు తిరిగి చూడకుండా పరుగెత్తాడు 'ఇదుగో డబ్బు తెచ్చేను, చిట్టీ! డాక్టరును తీసుకొస్తానమ్మా!' అంటూ యింట్లో జొరబడ్డాడు ఇంకెక్కడ చిట్టి? అప్పటికే చిట్టి ప్రాణవాయువులు నీలాకాశంలో లీనమైపోయాయి శాంతమ్మ కూతురు శవంమీద బోర్లా పడిఉంది, స్పృహ లేకుండా ఆమె పుష్కించిన చెక్కిళ్లమీద కన్నీరు చారలు కట్టింది పెద్దమ్మాయి ఒక మూలగా కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తూంది

ఈ దృశ్యం చూసిన వీరాస్వామి హృదయంలో దుఃఖం వెల్లువలై పారింది వీరాస్వామి నిలువునా చలించిపోయాడు అతని కూతురు దారిద్ర్యానికి బలియైపోయింది! అతని చేతిలో యిరవై వేల రూపాయల నోట్లు గాలికి రెపరెప లాడుతున్నాయి

వీరాస్వామికి మతిపోయింది—ఈసారికి పూర్తిగా మతిపోయింది చేజేతులా పిల్లను చంపుకొన్నాననే బాధ అతనిలో ఎక్కువై మనసును కలచివేస్తూంది జుట్టు పీక్కుంటూ, బట్టలు చింపుకుంటూ వీరాస్వామి వీధిలో పడ్డాడు, పిచ్చివాగుడుతో. వర్షం జోరుగా కురుస్తూంది బురద చిందుకుంటూ వీరాస్వామి ఊరికి దక్షిణంగా బయలుదేరాడు, వర్షంవల్ల నిర్మానుష్యంగా ఉన్న వీధులగుండా తనెక్కడికి పోతున్నాడో అతనికే తెలియదు. అయినా అతని కాళ్లు ఎక్కడికో లాక్కుపోతున్నాయి

ఊరిబయట కాలవ వంతెనమీదుగా నడుస్తున్నాడు, వీరాస్వామి వంతెనక్రింద గట్టు తెంపుకుని ప్రవహిస్తూంది, కాలవ పిచ్చెక్కిన మెదడు పాతవిషయాలు జ్ఞాపకం చేసుకుంటూంది వంతెనమీద మెల్లిగా నడుస్తూన్న వీరాస్వామి కాలుజారి కాలవలో పడ్డాడు ఇరవై వేల రూపాయల కరెన్సీనోట్లు కాగితంపడవ ల్లాగు నీటిమీద తేలుతూ ప్రవాహపువాలును సాగిపోయాయి వీరాస్వామి చేతులు మూడుసార్లు నీటిమీద కనిపించి మాయమైపోయాయి

అసలు వీరాస్వామి చాలా జాగ్రత్తగా నడుస్తాడు అయినా కాలుజారింది!!! ★

## డైరీ

(5-వ పేజీ తరువాయి)

శాసనసభలు, బాధ్యతాయుత మంత్రివర్గాలు సా ఏర్పడతాయి

—ఈ క్లిష్టతరుణంలో తంతి, తపాలా శాఖోద్యోగులు సమ్మెను తలపెట్టడం అనుచితమని రఫీ అహ్మద్ కిద్వాయ్ గారు తమ శాఖవారికి వీడ్కోలుసందేశ మిచ్చారు

—యున్నాన్ (చైనా) బర్మా సరిహద్దు పొడుగునా, చాంకైషేక్ సైన్యాలు బర్మా ప్రభుత్వసేనలతోను, చైనా కమ్యూనిస్టు సేనలతోను పోరాడుతున్నవని తెలిసింది



## శ్వేతపత్రం

(3-వ పేజీ తరువాయి)

పోవచ్చును కాని హైదరాబాదుకు, పాకిస్థాన్‌కు ఒక ముఖ్యవిషయంలో తేడా ఉన్నది ఈనాడు పాకిస్థాన్‌కు విదేశీయుల మద్దతు ఉన్నంతగా ఆనాడు హైదరాబాదుకు లేదు ఇటలీ, కెనడా, అమెరికా మొదలైన దేశాలనుండి పాకిస్థాన్‌కు వలసినంత ఆయుధసామగ్రి సప్లయి అవుతున్నది కాశ్మీరు వివాదవిషయంలో పాకిస్థాన్ చేసే దుష్ప్రచారానికి బ్రిటిష్, అమెరికన్, ఆస్ట్రేలియన్ పత్రికలు పెద్ద ప్రాముఖ్య మిస్తున్నవి లండన్ టైమ్సు, మాంచెస్టర్ గార్డియన్‌వంటి ప్రముఖ పత్రికలు పాకిస్థాన్ తరఫున వకాల్తా పుచ్చుకున్నట్లు వ్రాస్తున్నవి

ఇదంతా ఇలా ఉంచి, పాకిస్థాన్‌లో ఇండియాపై రెచ్చగొట్టబడుతున్న విద్వేష ప్రచారం ఎంతవరకూ పోతుందో, ఏ విష ఫలితాలను పరిణమింపచేస్తుందో చెప్పలేం శ్వేతపత్రంలో పాకిస్థాన్ గవర్నరు జనరల్ దగ్గిర్నించి, చిన్న చిన్న పత్రికలవరకూ కాశ్మీర్ విషయంలో చేస్తున్న ప్రచారం సోదాహరణంగా వివరించబడింది కాశ్మీర్ నే కాక భారతదేశాన్నంతటినీ జయించాలనీ, తిరిగి ఇస్లాం మత రాజ్యాన్ని స్థాపించాలనీ జరిగే ద్వేషప్రచారం విద్యావిహీనులైన ప్రజాబాహుళ్యం మీద ఎంతైనా పని చేస్తుంది తన దేశంలో ఇంత మతద్వేషం, యుద్ధోద్రేకం రెచ్చగొట్టబడుతున్నా పాకిస్థాన్ ప్రధాని తాము శాంతియుత పరిష్కారాన్నే వాంఛిస్తున్నామని ఎలా చెప్పగలుగుతున్నారో, భారతదేశ రక్షణ జాగ్రత్తలను ఎలా విమర్శించ సాహసిస్తున్నారో ఆశ్చర్యకరం ఒకసారి ప్రజల ఉద్రేకాన్ని రెచ్చగొట్టిన తరువాత అది ఆగటమంటూ ఉండదు విభజనకు ముందు, తరవాత జరిగిన రక్తపాతానికి మించిన ప్రమాదం జరగడానికి వీలున్నది దూరదృష్టిగల రాజకీయవేత్త గనుకనే ప్రధాని నెహ్రూ తమ ఉపన్యాసాలలోనూ, ప్రకటనల్లోనూ భారతప్రజలను సావధాన మనస్కులై ఉండవలసిందని పదేపదే హెచ్చరిస్తున్నారు పాకిస్థాన్ ప్రధాని భారతదేశంవైపు బిగించిన పిడికిలిని ఎత్తి చూపినప్పటికీ, నెహ్రూ భారతశాంతి కాముకత్వానికి చిహ్నమైన అశోకచక్రమే చూపుతున్నారు

## మళ్లీ చాంకైషేక్:

ఫార్మోజాలో అమెరికా సహాయంతో ప్రవాసప్రభుత్వ మేర్పరచుకొన్న చాంకైషేక్ తాను చైనాను తిరిగి జయించాలనే ఉద్దేశ్యంతో ఉన్నట్లు ఎప్పుడూ దాచలేదు అమెరికా చాంకైషేక్‌ను తిరిగి చైనాపై దండెత్తించాలనే అభిప్రాయంతో ఉన్నదో లేదో కాని అతనినిమాత్రం స్వప్రయోజనాల కోసం బాహాటంగా వాడుకుంటున్నది యావత్తు చైనాభూభాగంలోను సుస్థిరమైన పరిపాలన ఏర్పరచిన పెకింగ్ ప్రభుత్వాన్ని గుర్తించకుండా చాంకైషేక్ ప్రవాసప్రభుత్వమే నిజమైన ప్రభుత్వం అని వాదిస్తున్నది కొరియాయుద్ధం మిషతో ఫార్మోజాకు నౌకాదళం పంపి దాన్ని ఇంచుమించు తన అధీనంలో ఉంచుకున్నది చాంకైషేక్ సైన్యాలకు ఆయుధాలు సప్లయిచేసి తర్ఫీదు ఇస్తున్నది

ఈ పరిస్థితిలో బర్మా సరిహద్దులను అతిక్రమించి కమ్యూనిస్టుచైనాకు చెందిన యున్నాన్ రాష్ట్రంలోకి 20 వేలమందికి పైగా జాతీయచైనా సైనికులు జొరబడ్డారని సైగాన్‌నుండి వచ్చిన వార్త ఆందోళనకర మవుతున్నది. ఈశాన్య బర్మా సరిహద్దుల్లో ఈ జాతీయసేనలు అటు కమ్యూనిస్టుచైనాసేనలతోను, ఇటు బర్మాప్రభుత్వ సేనలతోను పోరాడుతున్నాయని మొన్న 4 వ తేదీన మరొక వార్త వచ్చింది ఈ సేనలు బర్మాలో ప్రవేశించి యునాన్‌వరకు ఎలా వెళ్లగలిగినవా అనేది దురూహ్యంగా ఉన్నది ఆ సేనలు మొదట బర్మాలో అడుగు పెట్టినప్పుడు నిరోధించకుండా, ఇప్పుడు యున్నాన్‌నుంచి తిరిగి బర్మాలో తలదాచుకొనవస్తుంటే బర్మీస్ సేనలు ఎందుకు నిరోధిస్తున్నవో మరీ దురూహ్యంగా ఉన్నది ఏమైనా జాతీయచైనా సేనలు ప్రారంభించిన ఈ కొత్త సాహసం వెనుక అమెరికా ప్రోత్సాహం, సలహా ఉన్నదని అనుమానించడం బేసబబు కాదేమో 'బహోసీ' అనే బర్మీస్ పత్రిక ఈ సేనలకు ఇద్దరు అమెరికనులు, కొందరు జపానీయులు సహాయం చేస్తున్నారని వ్రాసినది అటు కొరియాలో చైనీస్ కమ్యూనిస్టులను వెనక్కి కొట్టవేయడం సమితిసేనలకు అసాధ్యంగా ఉన్నది అందుచేత కమ్యూనిస్టుల బలాలను మరొకచోటికి ఆకర్షించడం అవసరం అసలు ఈ అవసరం గుర్తించబట్టే ఫార్మోజాను మొదట్లోనే అమెరికా ఆక్రమించుకున్నది అంతేగాక దక్షిణచైనాలో చాంకైషేక్ గెరిల్లా అనుచరులకు ధనసహాయమూ, ఆయుధసహాయమూ, నిపుణులసలహా సహాయమూ విరివిగా ఇస్తూ కమ్యూనిస్టు ప్రభుత్వంపై తిరుగుబాటులను ప్రోత్సహిస్తున్నది ఈ విషయాన్ని అమెరికన్ రాజకీయ, మిలిటరీ వర్గాలు ఇదివరలో అనేకసార్లు స్వయంగా బయటపెట్టాయి కనుక ఇప్పుడు బరా యునాన్ సరిహద్దుల్లో జరుగుతున్న సంఘర్షణలు కూడా అమెరికన్ ప్రోత్సాహంతోనే జరుగుతున్నవనడానికి అవకాశం ఉంది ఇలాంటి చిల్లర సంఘర్షణల మూలాన అమెరికా తన ఆశయాలను గాని, చాంకైషేక్ ఆశయాలను గాని సఫలం చేసుకోలేదు సరిగదా, కమ్యూనిస్టుచైనా వైరభావాన్ని ఇంకా పెంపొందించడం, చైనా-రష్యాల మైత్రిని ఇంకా దృఢతరం చేయడం మాత్రమే జరుగుతుంది అన్నిటికంటే ముఖ్యంగా అమెరికా ఆసియాలో తన పలుకుబడిని పూర్తిగా పోగొట్టుకుంటుంది



# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(7-వ పేజీ తరువాయి)

"మీరుమాత్రం మానవులందరిలోనూ ఒక్కరూ ఏదోవగా చేయ్యలేదంటారా ?"

"అలా కాదు నా దోషాల్ని మానవులు కనిపెట్టలేరు అంతే కాని మనం ఇదేమిటి ? ఏం మాట్లాడుతున్నాం ? నేను మీ న్యాయాధికారం చూసి భయం చెందను. నా అసాధారణ ప్రజ్ఞకి మీరు భయం చెందరు అంతటితో ఈవిషయం వొదిలేద్దాం"

"కాదండి కాదు" అన్నాడు విల్ ఫర్ట్ ఇప్పుడే వాదంలో తాను గెలుస్తున్నాడని విల్ ఫర్ట్ భావించాడు ; "మీ అద్భుత ప్రసంగంవల్ల నేను జ్ఞానం ఆర్జిస్తున్నాను మనం వాదించుకోడం లేదు మానవులకందని అతీతలోకాలలో విహరిస్తున్నాం నాకు నచ్చుటం లేదని మీ రనుకోనక్కర్లేదు తత్వవేత్తలు, తర్కశాస్త్రజ్ఞులు ఇంతకంటె కఠినవిషయాల్ని నిర్దయతో చర్చించేవారు కాస్సేపు మనం తత్వవేత్తల మనుకుందాం కాని నన్నొక్కటిమాత్రం చెప్పనివ్వండి. మీరు గర్వంతో అంధులైపోతున్నారు మీరు అన్య మానవులకంటె విశేష ప్రజ్ఞావంతులే కావచ్చు కాని మీ పైన భగవంతుడున్నాడు"

"నాపైన కాదు మనందరిపైనా" అన్నాడు మాంట్ క్రిస్టో ఈమారు అతని గంభీర కంఠ ధ్వని విని విల్ ఫర్ట్ లోలోన కంపించాడు తరవాత మాంట్ క్రిస్టో ఇలా అన్నాడు "మానవులందరికంటె నేను గొప్పవాడినని నాకు గర్వమున్నమాట నిజమే కాని భగవంతుని ముందుమాత్రమే నేను శిరస్సు వంచుతాను భగవంతుడే నన్ను మట్టినుంచి తెచ్చి ఇంత విశేషప్రజ్ఞా ప్రాభవా లిచ్చాడు"

"అయితే కౌంట్, మిమ్మల్ని నేను ప్రశంసించవలసిందే" అన్నాడు విల్ ఫర్ట్ "మీరు నిజంగానే విశేష ప్రజ్ఞావంతులైతే, అన్యమానవులకంటె పవిత్రులు ఉన్నతులు అయితే, ఇంకా ఇంత గర్వం ఉన్నదంటే మీలో కొన్ని కోర్కెలుకూడా ఉండి ఉంటాయి"

"అవును ఉన్నాయి"

"ఏమి టవి ?"

"నేనూ సామాన్య మానవులమాదిరిగానే అపార వాంఛలను కోంగాను భాగ్యసంపదలను, సర్వవాంఛితాలను ప్రసాదించి మాయ' 'నీ కింకేం కావాలి?' అని నన్నడిగింది నే నిలా చెప్పాను 'మానవులు విధి బలీయమైన దంటారు విధికి గల బలాన్ని, నిగ్రహానుగ్రహ సమర్థతనీ నాకు ప్రసాదించు' అన్నాను అప్పుడు మాయ' ఇలా బోధించింది 'నీ కా బలాన్నివ్వడం అసంభవం విధి ఏరీతిగా నిర్ణయిస్తుందో, భగవత్కార్యాలు ఏరీతిగా నెరవేరతాయో మానవులకు గోచరంకాదు అందువల్ల నీ కొక ఉపకారం మాత్రం చెయ్యగలను విధి నెరవేర్చవలసిన కార్యాలకు నిన్ను పరికరంగా నియమించగలను' ఇందుకు నేను సమ్మతించాను"

విల్ ఫర్ట్ అచ్చెరువుపొంది కొంతసేపటికి ఇలా అన్నాడు. 'కౌంట్ మీకు ఆప్తులెవరైనా ఉన్నారా ?"

"ఎవ్వరూ లేరు కానీ ప్రపంచంలో ఏకాకిని"

"పాపం!"

"ఎందుకు ?"

"ఆప్తులే ఉంటే మీ గర్వం భంగపడే అవకాశం ఉండేది. మీరు మృత్యువుకేకాని ఇంక దేనికీ భయపడరా ?"

"మృత్యువుకి కూడా భయపడతానని నేను చెప్పలేదే! మృత్యువు మాత్రమే నా జైత్రయాత్రను నిరోధించగలిగేది అని చెప్పాను"

"అయితే వృద్ధాప్యమో ?"

"వృద్ధాప్యం రాకముందే నాకు మృత్యువు వస్తుంది"

"బుద్ధి చాంచల్యం ?"

"ఒకప్పుడు నాపని అంతవరకూ వచ్చినదే"

విల్ ఫర్ట్ ఇలా అన్నాడు

"ఈ ప్రపంచంలో మరణంకంటె భీతిచెందవలసింది మరొకటుంది మాటవరసకి చెప్తున్నాను మూర్ఛ అనేది ఉంది మనిషిని అశక్తుని చేస్తుంది కాని చంపదు కాని అప్పుడు బ్రతికినా చచ్చినా ఒకటే మనిషి క్షణక్షణానికీ వ్యగ్రుడౌతున్నాడు. ఇటువంటి శిక్షల్ని మానవులకును దేవుడు విధిస్తూ ఉంటాడు ఇదెటువంటిదో తెలుసుకోవాలనే కోరికుంటే మీరు తీరికున్నప్పుడు ఒక్కసారి మాయింటికి దయచేయండి ఫ్రెంచి విప్లవంలో మహావీరు డనిపించుకున్న నా తండ్రి ఉన్నాడు ఆనాడు అతనికి దేశమంతా గడగడలాడిపోయింది అటువంటి నాతండ్రి, నయర్ టైర్ ఇప్పుడు అశక్తుడై రోగపీడితుడై మంచాన పడిఉన్నాడు అతన్ని చూస్తే మీవాదం నిలవదు ఆయనకూడా అప్పుడు తాను దైవనియుక్తుడనీ, అజేయుడనీ భావించాడు. మస్తిష్కంలో ఏదో ఒక చిన్న రక్తనాళం తెగినందువల్ల సర్వ సహజ ప్రజ్ఞలూ కోలుపోయినాడు అదికూడా క్షణంలో జరిగిపోయింది మహారాజుల్ని గజగజ లాడించిన నయర్ టైర్ క్షణంలో మనుమరాలిచేతి కీలుబొమ్మగా మారిపోయాడు"

"ఇటువంటిస్థితి నాకు తెలియకపోదు, నేనూ మర్త్యుడనే కాని నేను వైద్యశాస్త్రం, ఔషధశాస్త్రం అభ్యసించాను విధి నన్ను అశక్తతనుంచి కాపాడతూనే ఉంది తండ్రియాతనవల్ల కుమారుని మనస్సు వికలించడం సహజమే కాబట్టి మీకు మానవుని అశక్తత చక్కగా బోధపడింది నేను తప్పకుండా వచ్చి మీ తండ్రిగారిని చూడగలను వారి అనారోగ్యంవల్ల మీరు అధీరులైనట్లున్నారు"

"బొత్తిగా కాకుండా భగవంతుడు ఉపశమనకోసం నాకు ఇద్దరు బిడ్డల్ని ప్రసాదించాడు నా మొదటభార్య రినీ సెంట్ మిరాన్ వల్ల ఒక కుమార్తె ఉంది ఆమెపేరు వాలంటిన్ రెండో భార్యవల్ల ఎడ్వర్డ్ అనే కొడుకున్నాడు ఈ ఎడ్వర్డ్ నే ప్రాణాపాయంనుంచి మీరు కాపాడారు"

"మీకు భగవంతుడీ యిద్దరినీ ప్రసాదించినందువల్ల ఏమని భావిస్తున్నారు ?"

"నా తండ్రి ఉద్రేకాలకు లొంగి ఏవో అక్రమాలు, పాపాలు చేసిఉంటాడనీ, అందుకు భగవంతుడీ శిక్ష విధించాడనీ నా అభిప్రాయం ఆ శిక్ష ఇతరుల్ని బాధపెట్టకుండా దయతో ఇటువంటి వరం ప్రసాదించాడు"

మాంట్ క్రిస్టో పైకి చిరునవ్వు నవ్వినా లోలోన నొచ్చుకున్నాడు

తరవాత విల్ ఫర్ట్ లేచి, ఇలా అన్నాడు "ఇంక నేను సెలవు తీసుకుంటాను మిమ్మల్ని నేను మరచిపోలేను కొన్నాళ్ళకైనా నేను స్నేహపాత్రుడనని మీరే గ్రహిస్తారు"

మాంట్ క్రిస్టో వందనం చేశాడు విల్ ఫర్ట్ ఈమారు మెల్లిగా నడిచివెళ్ళి బగ్గీ ఎక్కాడు తరవాత మాంట్ క్రిస్టో దీర్ఘనిశ్వాసం విడిచి ఇలా అనుకున్నాడు "ఇక్కడికింక ఈవిషాక్త వాతావరణం చాలు దీనినుంచి ముక్తి పొందాలి" అలీని పిలిచి "ఆట్వేల్ వెళ్ళి హైడీని చూడాలి—బగ్గీ సిద్ధం చెయ్యి" అన్నాడు

Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras

త్వరలో వెలువడనున్నది.

ప్రసిద్ధ ఫ్రెంచి నవలాకారుడు

అలెగ్జాండర్ డ్యూమా

రచించన

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(మొదటి భాగం)

అనువాదం

సూరంపూడి సీతారామ్

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికనుండి పునర్ముద్రితము

వెల: మూడున్నర రూపాయలు

కాపీలకు

ఆంధ్రగ్రంథమాల,

మద్రాసు 1.

